

# చారిత్రక వ్యాసావళి



ఏటుకూరి బలరామమూర్తి



విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ.

# చారిత్రక వ్యాసావళి



ఏటుకూరు బలరామమూర్తి



విశాలాంధ్ర ప్రచురణాలయం
విజయవాడ - 2.

# విషయ సూచిక





1

# అజంతా

భారతీయ చిత్ర శిల్ప కళాసృష్టి పరాకాష్టనందుకున్న అజంతా ఎల్లోరా గుహలను సందర్శించే అవకాశం నాకు ఈ మధ్యనే లభించింది.

హైదరాబాద్‌నుండి పశ్చిమోత్తర దిశగా 318 మైళ్లు ప్రయాణంచేసి ఔరంగాబాదు చేరుకున్నాము. ఇది మరాట్వాడా ప్రాంతం. ఆంధ్ర, మరాట్వాడా ప్రాంతాలకు ఔరంగాబాదు సరిహద్దు జిల్లా. ఔరంగాబాదుకు 65 మైళ్ళు ఉత్తరంగా, సహ్యాద్రి సానువులలో అజంతాగుహలున్నాయి. ఔరంగాబాదుకు ఈశాన్యంగా 18 మైళ్ళలో ఎల్లోరాగుహలు మల్చబడ్డాయి. ఆంధ్ర శాతవాహనుల ప్రథమ రాజధానియైన పైఠాన్ (ప్రతిష్టానపురం), ఔరంగాబాదుకు దక్షిణంగా 30 మైళ్ళలో ఉన్నది. 2 వేల సంవత్సరాలక్రితం ఆంధ్ర ప్రజలు, శిల్పులు, చిత్రకారులు, భిక్షువులు, రాజులు, మెట్టిన ఆ పవిత్ర భూమిలోకి అడుగుపెట్టినంతనే ప్రాచీన చరిత్ర స్మృతులు ఎట్టివారినీ ఆవేశపరచకపోవు.

ఔరంగాబాదునుండి వెళ్ళే బస్సు 61 మైళ్ళు ప్రయాణంచేసి అజంతాగ్రామం చేరింది. ఆ పైన గుహలు నాలుగు మైళ్ళలో ఉన్నాయి. ఈ నాలుగు మైళ్ళు ఎత్తయిన కొండల పైన లోయలలో, కీకారణ్య ప్రాంతంగుండా ప్రయాణం చేసినమీదట గుహలను చేరుకుంటాము.

అజంతా గుహలసంఖ్య 29. ఈ గుహలు పశ్చిమాభిముఖంగా అర్థచంద్రాకారంలో ఉన్నాయి. గుహలకు ఒక

మూల వాఘీరనది కొండలపైనుండి జారుతూ చిన్న జలపాతాన్ని సృష్టిస్తుంది. ఈ కొండవాగు గుహాల ముందుగా రెండవకొసవరకు ప్రవహించి, ఇంకా ముందుకుసాగి, మొత్తం ఆ కొండప్రాంతాన్నంతా కొన్ని మైళ్ళమేరకు చక్రబంధంలో ఆవరిస్తుంది. ఎత్తయిన రెండు కొండలు ఆ రెండు కొండలను ఇంద్రుడు వజ్రాఘాతంతో నరికినందువల్ల ఏర్పడ్డదా అన్నట్లున్న సన్నని లోయ. ఆలోయలో గలగల ప్రవహించే వాఘీర. ఇట్టి ప్రకృతి సౌందర్య ముట్టిపడే చోటును తమ కళా సృష్టికి స్థావరంగా చేసుకున్న ప్రాచీనుల సౌందర్యపిపాస మనలను ముగ్ధులను చేస్తుంది.

అజంతా గుహాలలోని 8, 9, 10, 12, 13 నెంబర్లుగల గుహాల, వాస్తు లక్షణాలకు అమరావతి, నాసిక, కన్హేరీ వాస్తు లక్షణాలకు గల సన్నిహిత సామ్యందృష్ట్యా ఈ అయిదు గుహాలు శాతవాహన రాజులకాలంలో నిర్మించబడ్డాయని. చరిత్రకారులు నిశ్చయించారు. మిగతాగుహాలు, శాతవాహనుల తర్వాత, దక్కను పీఠభూమిని పాలించిన వాకాటక రాజుల కాలంలోను ఆ తర్వాత వచ్చిన చాళుక్యరాజుల కాలంలోను నిర్మించబడ్డాయి. అతి ప్రాచీనమైన గుహాలు క్రీ. పూ. 200 ల లోను అతి ఆధునికమైనవి. క్రీ. శ. 700 ల లోను – మొత్తం 900 సంవత్సరాల పాటు ఈ గుహాల నిర్మాణం, చిత్ర శిల్ప కళాసృష్టి సాగింది. వాకాటక రాజుల శాసనాలు 16, 18, 25 గుహాలలో లభించాయి. చాళుక్యరాజైన రెండవపులకేశి వద్దకు పర్షియారాజైన రెండవ ఖుస్రో రాయబారిని పంపిన ఘటన (క్రీ. శ. 610) మొదటిగుహాలో చిత్రీకరించబడింది.

3



# బౌద్ధ సంస్కృతి

అజంతా గుహాలలోని చిత్ర శిల్పకళ కంతా ఆలంబనము, బుద్ధుని జీవితగాథలూ, బౌద్ధజాతక కథలూ. జైన హిందూ సాంప్రదాయాలు అజంతాలో అడుగు పెట్టలేదు. ప్రతి చిత్రము, ప్రతి శిల్పమూ, దృశ్యమూ, ఏదో విధంగా బుద్ధుని జీవితంతోనూ, ఏ జాతక కథతోనో పెనవేసుకొని ఉన్నదే తప్ప వేరుగాదు. అజంతా గుహాలలో, 25 బౌద్ధ విహారాలు, 4 బౌద్ధ చైత్యగృహాలు ఉన్నాయి. చైత్యగృహాలు బౌద్ధ దేవాలయాల వంటివి. మధ్యలో స్తూపము, దానిచుట్టూ ప్రదక్షిణ పథము, ముందు చతురస్రము - ఇది చైత్యగృహ నిర్మాణము. ఇవి బౌద్ధ భిక్షువుల ప్రార్థన, ఆరాధనలకై ఉద్దేశించబడినవి. విహారాలలో 10 నుండి 20 వరకు గదులున్నవి. ఒక్కొక్క గది ఒక్కొక్క భిక్షువుకు వసతి గృహము. ఈ విహారాలలోనే ఒకటి రెండు సమావేశ భవనాలున్నవి. కనీసం 500 మంది భిక్షువులు వరుసలు వరుసలుగా, బల్లలవలె చెక్కబడిన శిలావేదికలపై కూర్చుని చర్చలు జరుపుటకు అనువైన విశాల సమావేశ భవనం అజంతా గుహాలలో ఒకటి ఉన్నది.

అజంతాలో శిల్పకళకూడా ఉంది. కాని చిత్రకళకే అజంతా పెట్టినది పేరు. 29 గుహాలలోను, 1, 2, 4, 9, 10, 16, 17, 19, 24, 26 గుహాలలో మాత్రమే అనగా 10 గుహాలలో మాత్రమే చిత్రకళ నేటికి నిలిచి ఉ... ...ఋగతా గుహాలలోని చిత్రాలన్నీ కాలగర్భంలో

మొదట్లో అన్ని గుహాలలోను చిత్రాలున్నట్లు పెల్లికలు ఊడి పోయిన గోడలను చూస్తే బోధపడగలము.

పైన చెప్పిన 10 గుహాలలోను, నాలుగు గుహాలు, 1, 2, 16, 17 - విద్యుద్దీప సహాయంతో మాత్రమే చూడ గలము. పగలు ఏ వేళలోకాని ఈ గుహాంతర్భాగంలోకి వెలుతురు రాదు. ఈ నాలుగు గుహాలలోనే నేటికి చిత్రాలు ఏమాత్రం చెడకుండా ఉన్నాయి. వీనిలోకూడా 17-వ గుహ అతి విశాలమైనది. అజంతా చిత్రకళ ఈ గుహాలో ఉచ్ఛ స్థాయినందుకున్నదని చెప్పవచ్చు.

## జాతక కథలు

మహాజనక జాతకం. చాంపేయ జాతకం, క్షాంత వాద, హంస, రురు, విదురపండిత, సుతసోమ, షడ్దంతక, మహాకపి, విశ్వంతర, శరభ, మాతృపోషక, మత్స్య, శ్యామ, మహిష, శిబి జాతకకథలు ఈ గుహాలలో చెక్కబడ్డాయి. ప్రతికథ బుద్ధుని ఒక అవతారగాథ. కోతిగాను, ఏనుగుగాను, కుందేలుగాను, చేపగాను, మంత్రిగాను బుద్ధుడు జన్మించి, భూతదయ, సహనము, స్వార్థత్యాగము, ప్రేమ, తోటిజీవు లను బోధించినట్లుగా ఈజాతక కథలన్నీ రచించబడ్డాయి. ఈ జాతక కథాచిత్రాలలో నాటి సాంఘికజీవితం, వేషభాషలు అలంకారాలు, పనిముట్లు, ఆయుధాలు, మొత్తం సామాజిక జీవితమంతా మన కళ్ళఎదుట సాక్షాత్కరిస్తుంది.

నాటి రాజభవన దృశ్యాలు, అచ్చటి పరికరాలు, వారి వేషభాషలు తెలుసుకునేందుకు మహాజనక జాతకం ఉపయోగ [illegible] డుడు మహాజనకుడను రాజు అవతారంలో

ఉంటాడు. రాజ్యాన్ని వదలి సన్యసిస్తానని మహాజనకుడు, తన రాణితో చెపుతాడు. రాణి, పరిచారికలతో సహా మహాజనకుని సన్యసించే ప్రయత్నంనుండి విరమింపచేయటానికి యత్నిస్తుంది. ఇది ఒక దృశ్యం. ఐహిక సుఖాలపట్ల ఆసక్తి కలిగించేందుకు, వేశ్య బాలికల నృత్యం ఏర్పాటు చేయబడుతుంది. ఇది రెండవ దృశ్యం. చిట్ట చివరకు స్థిత ప్రజ్ఞుడైన మహాజనకుని దీక్షకు ఓడి, రాణి తాను సైతం సన్యాసాశ్రమానికి బయలుదేరుతుంది. ఇది మూడవ దృశ్యం. ఈ మూడు దృశ్యాలు మహాజనక జాతకంలో చిత్రించబడ్డాయి.

నాటి పౌరజీవితాన్ని గ్రహించేందుకు విశ్వాంతర జాతకం సహాయపడుతుంది. విశ్వాంతరుడను రాజకుమారుడు భార్యతోసహా అడవులకు వెళ్ళుతుంటాడు. బజారులో ఒక దుకాణంలో ఒక వర్తకుడు త్రాసుతో ఏవో వస్తువులు తూస్తుంటాడు. మరొకడు కూరగాయలను పట్టుకు వెళ్ళు తూంటాడు. ఒక కమ్మరి, ఏవో సామగ్రిని చేస్తూంటాడు. ఈ దృశ్యాలన్నీ రాజవీధిలో చక్కగా చిత్రించబడ్డాయి.

వివిధ మనోవైఖరులను చిత్రించుటలో చిత్రకారుని ప్రతిభను ద్యోతకంచేసే కథ మహాకపి జాతకం. ఒక కోతి, దారితప్పి గోతిలోబడ్డ బ్రాహ్మణుని రక్షిస్తుంది. కాని ఆ బ్రాహ్మణుడు విశ్వాసఘాతుకుడై నిద్రిస్తున్న ఆ కోతిని రాతితో చంప యత్నిస్తాడు. ఆ కోతి వెంటనే నిద్రలేలుంది. తన దుర్బుద్ధికి బ్రాహ్మణుడు ఖిన్నుడై తలవంచుతాడు. ఆ కోతి తన ప్రాణానికే మోసం తలపెట్టిన బ్రాహ్మణునిపై ఎట్టి

కోపం ప్రదర్శించక, అతని తప్పును క్షమించి అడివినుండి స్వగ్రామం వెళ్ళేమార్గం చూపిలుంది. ఇందులో కోతి బోధి సత్త్వుని అవతారం. ఈ చిత్రంలో కోతి వేర్వేరు ముఖ భావాలను చిత్రించే 7, 8 బొమ్మలున్నాయి. ఆలోచన, జాలి, అమాయకత్వము, విస్మయము, కరుణ - మొదలయిన భావాలన్నిటిని చిత్రకారుడు అతి ప్రతిభావంతంగా ఇందులో చూపించాడు.

## భావితరాలవారికి పెన్నిధి

అజంతా చిత్రాలను చూస్తున్నపుడు అనేక ప్రశ్నలు, సందేహాలు మనకు కలుగుతాయి. కొండలలో, అడవులలో ఇంత మారుమూలప్రాంతంలో బౌద్ధభిక్షువులు నివసించవలసిన అవసరం ఏమివచ్చింది? పగటిపూటసైతం దీపపుకాంతి లేనిదే చొరవీలుకాని గుహాలను తమ చిత్రకళకు స్థావరంగా ఎందుకు చేసుకున్నారు? నెలలు, సంవత్సరాల తరబడి ఈ గుహాలలో చిత్రనిర్మాణంలో నిమగ్నులైననాటి చిత్రకారులు, వెలుగును కలిగించేందుకు ఏ సామగ్రి వాడారు? ఇన్ని ఏండ్లు గడిచిన తర్వాతకూడ తమ శోభను కోల్పోని చిత్రాలకుగాను వారు ఏ రంగులను, ఏ కుంచెలను వాడారు? ఈప్రశ్నలన్నీ చిత్రాలు చూస్తున్నంతసేపు ప్రతి ఒక్కరికి కలుగుతాయి.

వీనిలో కొన్నింటికి మనం సమాధానం చెప్పుకోవచ్చు. అజంతా గుహాలు నేడు మారుమూలగా ఉన్నప్పటికి నాడు ఉత్తర దక్షిణ హిందూదేశాల మధ్యగల రహదారి ప్రక్కనే ఉన్నవి. నేటి బస్సురోడ్డు ఇంచుమించు నాటి రహదారి.

మధ్యప్రదేశ్ నుండి దక్కను పీఠభూమిలోకి అడుగు పెట్టేందుకు ఇదే దారి. కనుకనే రాచబాటకు 4 మైళ్ళ సమీపంలో ఈ గుహాల నిర్మాణం జరిగింది. తమ కళలకు శాశ్వతత్వాన్ని ఇవ్వవలెననీ, వేల సంవత్సరాల తర్వాత సైతం అవి చెక్కు చెదరకుండా ఉండవలెననీ, నాటి కళాకారులకు గలిగిన ప్రగాఢ దీక్ష వల్లనే, ఆ గుహాంతర్భాగాలలో, గోడలమీద, పైకప్పు మీద, సూర్యరశ్మి చొరలేనిచోట, వారు ఏండ్లు దశాబ్దాలు, శతాబ్దాలు శ్రమించి తమ నైపుణ్యమంతా వడకట్టి భావి తరాలవారికి అందించిపోయినారు. వివిధరకాల రంగులను తయారు చేయుటలోను, కుంచెలను వాడుటలోను, అత్యున్నత సాంకేతిక నైపుణ్యాన్ని ప్రదర్శించారు. 16 వ గుహ పైకప్పు అంచులు ముడివేయబడి మధ్య వదులుగా ఉన్న చాందినీ గుడ్డ అనే భ్రమను గలిగించేటట్లు చిత్రించబడ్డది. పైకప్పు చిత్రాలలో జంతువులు, పక్షులు, పూలు, తీగెలు, చెట్లు చిత్రించబడ్డాయి. గోడలను బౌద్ధజాతక కథలకు, పైకప్పును ప్రకృతి చిత్రాలకు చిత్రకారులు కేటాయించినట్లు బోధపడుతుంది.

బుద్ధుని జీవితంలోని వివిధ ఘట్టాలు ఈ చిత్రాలలో వివరించబడ్డాయి. బుద్ధిని తల్లి మాయాదేవి కల, లుంబినీ వనంలో బుద్ధుని జననం, బుద్ధుడు జన్మించిన వెంటనే ఇంద్రాది దిక్పాలురు అతనిని గౌరవించటం, పుట్టినవెంటనే బుద్ధుడు ఏడు అడుగులు వేసి తన మహాత్మ్యాన్ని చూపటం, బుద్ధుని విద్యాభ్యాసం, మహాభినిష్క్రమణం, సుజాతచేతి అన్న— తినటం, మార గర్వభంగం, కపిలవస్తు నగరాని

భార్యవద్ద బుద్ధుడు భిక్షను స్వీకరించటం – మొదలైన ఘటనలన్నీ అతి హృద్యంగా చిత్రించబడ్డాయి.

బుద్ధుడు, కపిలవస్తునగర వీధులలో సంచరిస్తూ, తన భార్య వద్ద భిక్షను స్వీకరించే ఘట్టం అతి మనోహరంగా చిత్రించబడ్డది. బుద్ధుడు సర్వసంగ పరిత్యాగి. భార్య, పుత్రుడు మొదలైన భావాలకు ఏనాడో దూరుడైనాడు. అందరినీ భిక్ష అడిగినట్లే భార్యదగ్గరకూ వెళ్ళి భిక్ష అడుగుతాడు. ఆ ఘట్టంలో బుద్ధుని ముఖంలో నిర్వికారత, ప్రశాంత గంభీరత, ధర్మదీక్ష, చిత్రకారుడు చక్కగా ప్రదర్శించాడు. బుద్ధుని భార్య యశోధరకు తన భర్త మహాప్రవక్త ఐనాడని తెలుసు. ఆయనపట్ల గౌరవమూ కలదు. కాని ఎంతైనా తన భర్తకాదా? తనపై కొంచెమైనా ప్రత్యేకఆదరణ చూపడా అని ఆశిస్తుంది. కించిదుత్కంఠితయై బుద్ధునిపైపు చూస్తుంది. 6 ఏండ్ల కుమారుడు రాహులునిచే తండ్రికి భిక్ష పెట్టిస్తుంది. బాలుని ముఖంలో విస్మయమూ, ఆశ్చర్యమూ తప్ప వేరు భావమే లేదు. బుద్ధుని జీవిత గాధలను చిత్రించిన అన్ని దృశ్యాలలోకి ఈ దృశ్యం మిన్నగా ఉన్నదని నాకు తోచింది.

## సాంస్కృతి విప్లవం

బౌద్ధయుగం సాంస్కృతిక కళారంగాలలో విప్లవాత్మక [illegible]ణామాలకు కారణభూతమైంది. అతి ప్రాచీనమైన హారప్ప [illegible]రో నిర్మాణాల తర్వాత, తిరిగి సాంస్కృతిక [illegible] బౌద్ధయుగంలోనే జరిగిందని చరిత్రకారులంతా

ఏకకంఠంతో తెలియజేస్తున్నారు. నిర్దిష్టంగా చెప్పదలుచుకుంటే అశోక చక్రవర్తి పరిపాలన తర్వాతనే (క్రీ. శ. 250) ఈ సాంస్కృతిక విప్లవం ప్రారంభమైంది.

స్వయం సంపూర్ణ గ్రామీణ వ్యవస్థ అశోక చక్రవర్తి పరిపాలనానంతరమే ఒక స్పష్టమైనరూపం ధరించింది. అంతకు ముందున్న కులపతి వ్యవస్థ, బానిస విధానం నశించాయి. అగ్రవర్ణాల నిరంకుశత్వాన్ని ఎదిరించి. సమానత్వసూత్రాన్ని గ్రామగ్రామాన ప్రచారంచేసిన బౌద్ధమతం ఇట్టి ఆర్థిక సాంఘిక పరిణామాలకు సహాయకారి అయింది. వర్ణవ్యవస్థ విధించిన కఠిన నియమాల క్రింద నలిగిపోతున్న, ప్రజాసామాన్యం చేతులకుగల సంకెళ్ళు బద్దలయ్యాయి. ప్రజల సృజనాత్మక కళాభినివేశం వేయిభంగుల వికసించింది. శిల్పులు, చిత్రకారులు, గృహ నిర్మాతలు, పీడిత ప్రజానీకమంతా బుద్ధునిపైగల తమ ప్రగాఢ ప్రేమాభిమానాలను ప్రదర్శించి కొండలను పిండిగొట్టినట్లుగా, రాళ్ళను మైనపు ముద్దలవలె మలచి, కళాసృష్టి కొనసాగించారు. ఈ పరిణామానికి నాటి మౌర్య, శాతవాహన, వాకాటక, చాళుక్య, గుప్తరాజులు సహాయపడ్డారు. పశ్చిమ భారతంలో నాసిక్, కన్హేరీ, భిల్సా, అజంతా, ఎల్లోరా గుహలు, ఆంధ్రదేశంలో అమరావతి, నాగార్జునకొండ, గోలి, జగ్గయ్యపేట శిల్పాలు, ఉత్తరహిందూస్థానంలో సాంచి, సారనాథ్‌లు, పశ్చిమోత్తర ప్రాంతంలో తక్షశిల, పెషావరులలోని శిల్పాలు, ఒకటేమిటి భారతదేశం నలుమూలలా చిత్రకళ, శిల్పకళ బౌద్ధయుగంలోనే ప్రారంభమై, వికసించి మహోన్నతస్థాయి నందుకున్నది.

# జీవిత సౌందర్యం

అజంతా చిత్రాలను చూస్తున్నపుడు కొట్టవచ్చినట్లుగా కనపడే మరొక విషయం కూడా ఉంది. బుద్ధుని జీవిత చిత్రణ పట్ల నాటి కళాకారు లెంతశ్రద్ధ వహించారో స్త్రీల చిత్రణపట్ల కూడా వారు అంతే శ్రద్ధవహించారు. వివిధ భంగిమలలో వందలు, వేలు స్త్రీలు, రాజకాంతలు, పరిచారికలు, వేశ్యలు, సామాన్యస్త్రీలు, వృద్ధులు, బాలికలు, అజంతాకుడ్య చిత్రాల నిండా మనకు కనిపిస్తారు. వైరాగ్య ప్రధానమైన బౌద్ధ కళాకారుల దృష్టి స్త్రీలపై కేంద్రీకరించబడనేల? అనే సమస్య సహజంగా వస్తుంది.

బుద్ధుడు వైరాగ్యాన్ని బోధించాడు. ఆచరించాడు. వేలకొలది పురుషులను, స్త్రీలను భిక్షువులుగా చేశాడు. కాని బుద్ధుని దృక్పథంలో మొదటినుండి ఒక మధ్యేమార్గం కనిపిస్తుంది. అత్యంత భోగలాలసత్వం పనికిరాదు. అతికఠినమైన జీవితాన్ని గడిపి, పంచాగ్ని మధ్యంలో తపస్సు చేయనక్కర లేదు. సామాన్య ప్రజలు సాంసారిక జీవితాన్ని గడుపుతూనే వీలైనంతవరకు తమ జీవితంలో భూతదయ, సహనం, ప్రేమ, ఆత్మనిగ్రహం - అలవర్చుకోవాలి. భిక్షువులు సైతం తమ జీవితాన్నంతా ప్రజాసేవకే వినియోగించాలి. కొన్ని వేల మంది సర్వసంగ పరిత్యాగులు కావచ్చు. కాని వారి లక్ష్యం మాత్రం మానవ జీవితాన్ని మరింత సుఖప్రదం, ఆహ్లాదకరం, నీతిపూరితం, నియమబద్ధం చేయటమేతప్ప వేరుకాదు. బౌద్ధ జాతక కథలన్నీ యిదే సత్యాన్ని నిరూపిస్తున్నాయి. కనుక

బౌద్ధమతం జీవితంపట్ల, సంసారంపట్ల అనాదరణను, అసహ్యతను కాక - గౌరవాన్ని అభిమానాన్ని కల్పించింది.

మరొక కారణంకూడా వుంది. సమానత్వాన్ని ప్రేమను బోధించిన బౌద్ధమతం పురుషులలో కంటెకూడా స్త్రీలలో విస్తారంగా వ్యాపించింది. పురుషులు హిందూదేవతలను ఆరాధించగా, స్త్రీలు బౌద్ధమతాన్ని అభిమానించిన అనేక ఘట్టాలు భారతదేశ చరిత్రలోను, ఆంధ్రుల చరిత్రలోను ఉన్నాయి.

అజంతా గుహలలోని స్త్రీరూప సృష్టిలో మరొక ప్రత్యేకతకూడా ఉంది. అత్యంత శృంగారంగా అలంకరించుకుంటున్న స్త్రీలు, పురుషులను ఆకర్షించవలెననే ఉద్దేశంతోనే నృత్యంచేస్తున్న వేశ్యలు, విరహోత్కంఠలు - వందలు ఈ కుడ్యచిత్రాలలో చిత్రించబడ్డారు. కాని వారి అందరి ముఖాలలోను, ఏదో చెప్పలేని ఔన్నత్యము, బుద్ధునిపట్ల అపార ప్రేమ, తమ ఉనికిని సైతం మరచి బుద్ధుని చల్లని బోధనలను తదేకదీక్షతో వినే ఏకాగ్రత - ప్రస్ఫుటంగా కనిపిస్తున్నది. ఈ చిత్రాలలోని చరాచరజీవకోటి, అయస్కాంతముచే ఇనుపముక్కలు ఆకర్షించబడ్డట్లు - బుద్ధునివైపు ఆకర్షించబడతారు. మహోన్నతమైన బుద్ధుని గంభీర ప్రశాంతదృక్కులు, మూలమూలల ప్రసరించి, వ్యక్తుల మాలిన్యాన్ని క్షాళనం చేసి, శృంగారరసాన్ని సైతం, ఆ గంభీరతకు లోనుచేసి అజంతా చిత్రాలన్నిటికీ ఒక పవిత్రత, ఔన్నత్యం, ఉదాత్తత, అంతర్దృష్టి-కలిగిస్తున్నాయి. శృంగార రసాన్ని, నెగటుకల్గించే

విధంగా కాక, జీవితానికి పరిపుష్టినిచ్చే ఒక అత్యవసర ఉపాంగంగా, చిత్రించిన అజంతా కళాకారుని ప్రతిభ వర్ణనాతీతం.

స్త్రీపురుష ఆకర్షణ ప్రకృతిసిద్ధము. ఈఆకర్షణ ఒక అగ్నివంటది. ఈ అగ్నిని పూర్తిగా ఆర్పివేస్తే జీవితమేలేదు, సృష్టిలేదు. కాని ఈ అగ్నిని విచ్చలవిడిగా ప్రకోపింప చేస్తే అందులోపడి శలభమువలె మానవులు భస్మమౌతారు. ఈ రెండు మార్గాలను విసర్జించి, ఈఆకర్షణకు, ఉదాత్తత, పవిత్రతను ఆపాదించిననాడు, అది మానవుని ఉన్నత పథాలను చేరవేసే సాధన కాగలదు. ప్రపంచ చరిత్రలోని మహాకవులు, మహాకళాకారులు అందరూ తమకళద్వారా ఇట్టి ఉదాత్తతను జీవిత సౌందర్యాన్ని నిరూపించ యత్నించినవారె. అజంతా కళాకారునిసైతం, అట్టి మహాకళాకారుల కోవకు నిస్సందేహంగా చేర్చవచ్చు.

## ఎల్లోరా గుహలు

అజంతా గుహలు చిత్రకళకు ప్రసిద్ధి చెందినవైతే, ఎల్లోరా గుహలు శిల్పకళకు పేరు గాంచినవి. ఈ గుహల మొత్తం సంఖ్య 34. వీనిలో 1 నుండి 12 వరకు బౌద్ధగుహలు 13 నుండి 29 వరకు హిందూ గుహలు, 30–34 వరకు జైన గుహలు.

12 బౌద్ధ గుహలలోను ఒకటి చైత్యగృహము. మిగతా పదకొండు విహారాలు. ఎల్లోరా గుహలు అజంతా గుహల కంటె చాలా పెద్దవి. రెండతస్తుల, మూడంతస్తుల గుహలు

కూడా ఉన్నాయి. అజంతాలోవలె ఎదురుగా కొండ లేక పోవటంవల్ల, గుహాముఖద్వారాలు విశాలంగా ఉన్నందువల్ల, అంతస్థులు సైతం ఉన్నందువల్ల, సూర్యరశ్మి పుష్కలంగా గుహాలలోకి ప్రవేశిస్తుంది. కనుక చీకటి సమస్య లేదు. ఎల్లోరా మొదటి గుహలో ప్రవేశించగానే, బ్రహ్మాండమైన బుద్ధవిగ్రహాలు నలువైపులా కొట్టవచ్చినట్లున్నాయి. ఒక్కొక విగ్రహం, 12 అడుగుల నుండి 15 అడుగుల ఎత్తువరకూఉంది. ఒక్కొక్క గుహలో 20 కి తక్కువ లేకుండా, మొత్తం 200 పైచిలుకు బుద్ధవిగ్రహాలు ఆ గుహాలలో చెక్కబడ్డాయి. ప్రతి విగ్రహం, జీవం ఉట్టిపడుతూ మన కేదో చెపుతున్నట్లు, బోధి స్తున్నట్లు ఉంటుంది. గుహాద్వారబంధాలలోను గోడల పైభా గంలోను, వందలాది. వివిధ శిల్పాలు, నాట్యంచేస్తున్న స్త్రీలు, స్త్రీ పురుషుల జంటలు చెక్కబడ్డాయి.

ఎల్లోరా గుహాలలో అతి ప్రాచీనమైనవి శాతవాహన కాలంలో ప్రారంభమైనాయి. క్రీ. శ. 700 వరకు ఈ గుహాల నిర్మాణం సాగింది. హిందూ గుహాలు క్రీ. శ. 900 మొదలు 1200 వరకు చెక్కబడ్డాయి. జైన గుహాలు కూడా బహుశా ఆ కాలంలోనే చెక్కబడి వుంటాయి.

శిల్పకళ ఎల్లోరాలోని బౌద్ధగుహాల అత్యున్నతస్థాయి నందుకున్నదంటే, ఆశ్చర్యంలేదు. ఆ విగ్రహాల వైపు ఎంత సేపు చూసినా తిరిగి రాబుద్ధిపుట్టదు. బుద్ధుడు నిలుచున్నట్లు, పద్మాసనంలో కూర్చున్నట్లు, బోధచేస్తున్నట్లు, ధ్యానం చేసు కుంటున్నట్లు, - వేర్వేరు భంగిమలలో ఈ విగ్రహాలున్నాయి.

వందలాదిగా ఉన్న ఈ బుద్ధవిగ్రహాలలో ఒకదానినిపోలి మరొకటి లేదు. ప్రతి విగ్రహంలోను ఏదో ఒక ప్రత్యేకత, విస్పష్టత గోచరించగలదు.

ఎల్లోరాలోని భిక్షువులు నివసించే గదులుకూడా అజంతాలో కంటె విశాలమైనవి బహుళ సంఖ్యలో ఉన్నవి. మొత్తం 12 గుహాలలోను వెయ్యిమంది భిక్షువులకు పైగా నివశించటానికి తగిన గదులున్నాయి. ప్రతిగదిలోను భిక్షువు శయనించేందుకు ఒక రాతి బల్ల, పుస్తకా లుంచుకునేందుకు ఒక అల్మారా ఉన్నాయి. ఇవికాక సమిష్టి చర్చలకొరకుద్దేశింపబడిన రెండు సమావేశ భవనాలుకూడా ఉన్నాయి. అజంతాలోకంటె ఎక్కువ సంఖ్యలో, ఎక్కువ కాలం, ఎల్లోరాలో బౌద్ధభిక్షువులు నివసించి ఉన్నారని ఊహించవచ్చు. గుహాలమధ్య చిన్న చిన్న కొండవాగులున్నాయి. సమీపంలో పెద్ద చెరువున్నది. ఏలుడను రాజు నిర్మించినందువల్ల ఈ గుహాలవద్ద గ్రామానికి ఎల్లోరా అని పేరువచ్చినది. వందల ఏండ్లు, బుద్ధంశరణం గచ్ఛామి, ధర్మం శరణం గచ్ఛామి, సంఘం శరణం గచ్ఛామి – అను భిక్షువుల త్రిశరణ నాదంతో, ఈ గుహాలు మార్మోగినవి.

బౌద్ధ గుహాలను అనుకరించి హిందూ గుహాలు చెక్కబడ్డాయి. వీనిలో శైవ వైష్ణవ సాంప్రదాయాలు రెండూ పక్కపక్కనే వున్నవి. శివపార్వతుల వివాహం, మార్కండేయుని కథ, విష్ణుమూర్తి అవతారాలు, కృష్ణుడు గోవర్ధనగిరిని ఎత్తటం – మొదలైన పౌరాణిక కథలన్నీ వున్నాయి. 16 వ

గుహ కైలాసం. ఇది ఎల్లోరా గుహ లన్నిటిలోకి పెద్దది. ఒక పెద్ద దేవాలయం, శిఖరం, గర్భగుడి, ముఖ మంటపములతో సహా, కొండలో చెక్కబడ్డది. మిగతా కొండనుండి, ఈ రాయి విడగొట్టబడి, దేవాలయం చుట్టూ ప్రదక్షణం చేసేందుకు మార్గంసైతం యేర్పరచబడ్డది. ఈ దేవాలయం పొడవు 164 అడుగులు, వెడల్పు 109 అడుగులు, ఎత్తు 96 అడుగులు. కైలాసం గోడలమీద రామాయణ, భారత గాధలు మలచబడ్డాయి. హిందూ గుహాలలోని శిల్పాలన్నిటిలోకె శిల్పకళరీత్యా అత్యున్నతస్థాయి నందుకున్న విగ్రహం, శివుని భైరవ నృత్యం. ఈ ఒక్క శిల్పం మాత్రం, బౌద్ధశిల్ప స్థాయిని అందుకోగల్గింది మిగతా హిందూ శిల్పమంతా రెండవ తరగతికి చెందినది మాత్రమే. శివుని భైరవనృత్య శిల్పం హఠాత్తుగా చూసినపుడు, నిజంగా ఆ గోడమీద ఒక వ్యక్తి నృత్యంచేస్తున్నాడా అనిపిస్తుంది.

జైన గుహాలలో ప్రత్యేకత ఏమీలేదు. శిల్పనైపుణ్యాస్థాయిలో ఇవి హిందూ గుహాలకంటె కూడ తక్కువ స్థాయిలో ఉన్నవి.

అస్తమయ సూర్యుని కిరణాలు సాయంత్రం 5 తర్వాత, బౌద్ధగుహ లన్నిటిలోకి సూటిగా ప్రసరించి, ఒక గంటసేపు వందలాది బౌద్ధవిగ్రహాలను ప్రకాశవంతం చేస్తాయి. బుద్ధునికి అంజలి ఘటించిన తరువాత మాత్రమే సూర్యుడు అస్తమించగలడు. ఆ గుహాల నిర్మాణం అట్టివిధంగా జరిగింది.

వ్యాసం ముగించేముందు ఒక విషయం చెప్పవలసి ఉంటుంది. యాత్రీకులకు ఈ గుహల ప్రాధాన్యతను వివరించేందుకు ప్రభుత్వం ఎట్టి సదుపాయాలను కల్గించలేదు. గుహల వద్ద, ఆ గుహల నిర్మాణ కాలాన్ని శిల్ప విశేషాలను తెలియజేసే ఫలకాలు ఉండాలి. చౌకలో మార్గదర్శక గ్రంథాలు అచ్చువేయించాలి. ప్రస్తుతం రెండూ లేవు. ఔరంగాబాదులో పురావస్తుశాఖకు చెందిన ఒక ఉద్యోగి మాత్రం ఉన్నాడు. విదేశ యాత్రికులు వచ్చినపుడు మాత్రం ఈ ఉద్యోగి వారివెంట తిరిగి, అన్ని విషయాలు వివరిస్తాడు. దేశీయ యాత్రికుల కట్టి సహాయం లేదు.

ఈ కనీస ఏర్పాట్లను చేసి అపూర్వ కళాసృష్టికి చిహ్నాలైనా అజంతా - ఎల్లోరా గుహలపట్ల ప్రజలకు ఇతోధిక ఆసక్తిని కలిగించవలసిన బాధ్యత ప్రభుత్వంపైన ఉన్నది.

(14—11—56)



17

# హంపి - విజయనగరం

హంపి - విజయనగర శిథిలాలను చూసే అవకాశం ఈ మధ్య తలవని తలంపుగా లభించింది.

గుంతకల్లులో ఉదయం 9-30 గంటలబండిలో బయలు 70 మైళ్ళు ప్రయాణంచేసి మిట్ట మధ్యాహ్నం 1-30 గంటలకు హోసపేట చేరుకున్నాము. రైల్వే భోజనశాలలో నాలుగు మెతుకులు తిని, ఊళ్ళోకి వెళ్ళాము.

హోసపేటకు హంపి 8 మైళ్ళు. ప్రతి అరగంటకు బస్సులూ, ప్రైవేటు టాక్సీలు వెళ్ళుతూనే ఉంటవి. హోసపేట పూర్తిగా కన్నడ ప్రాంతం. కాని కిల్లీదుకాణాలలోను, మంగలి షాపులలోను సగానికి సగం తెలుగువారివి. కర్నూలు నుండి బళ్ళారిలోని తెలుగు తాలూకాలనుండి పొట్టగడపటం కోసం అనేకమంది తెలుగుసోదరులు అక్కడకు చేరుకున్నారు. హంపికి వెళ్ళేముందు హోసపేటకు 3 మైళ్ళలో ఉన్న తుంగభద్ర ఆనకట్టను చూసివస్తే టైము కలసి వస్తుందని, ఆనకట్ట చూసేందుకని బయలుదేరాము.

## తుంగభద్ర ఆనకట్ట

3 అణాలు బస్సు ఛార్జితో ఆనకట్ట చేరుకున్నాము. విజయవాడవద్ద కృష్ణానది రెండు కొండల మధ్యగా ప్రవహిస్తున్నట్లు ఇక్కడకూడా తుంగభద్ర రెండు కొండల మధ్యగా ప్రవహిస్తున్నది. నదికి ఆవలి ఒడ్డున హైద్రాబాద్ ప్రాంతం. ఇవతలి ఒడ్డున మైసూరు ప్రాంతం. ఈ రెండు

కొండల మధ్య ఆనకట్టను నిర్మించారు. ఆనకట్ట మొత్తం పొడవు ఆమూలనుంచి ఈమూలకు 2 మైళ్ళు ఉంటుంది. ఆనకట్ట నిర్మాణంకొరకు చేరిన కార్మికులు, ఇంజనీర్లు, తదితరులు మొదలైనవారి ఇండ్లతోను, నర్కు-షాపులతోను, ఒక చిన్న కాలనీ ఇటువైపు ఏర్పడ్డది. అదేవిధంగా హైద్రాబాదు వైపు కూడ మునీరాబాద్ అనే ఒక కాలనీ ఏర్పడ్డది.

ఇక్కడ కొండలు ఒకదాని వెంబడి ఒకటి వరుసగా కుప్పలుపోసినట్లున్నవి. నదికి దక్షిణంగా మైసూరువైపు కను చూపు మేరవరకు కొండ గుట్టలు తప్ప మరొకటిలేవు. ఆనకట్ట నిర్మాణం దాదాపు పూర్తిఅయింది. హైద్రాబాద్ వంతు సగభాగం నిర్మాణం ఇంకా చాలా జరగవలసి ఉంది.

పది సంవత్సరాల క్రితం నిర్మానుష్యంగా ఉన్న ఆ ప్రాంతం నేడు జనంతో కిటకిటలాడుతూ చూడ ముచ్చటగా ఉంది. రాత్రిపూట విద్యుద్దీపాల కాంతిలో, ఆనది రెండు వైపుల కొండల బారులు, బ్రహ్మాండమైన ఆనకట్ట, కాలనీలు-కొండపైన నిర్మించబడ్డ సర్క్యూటు హౌసును ప్రకృతిపై మానవుడు సాధిస్తున్న విజయ సోపాన పరంపరలో ఒక మెట్టుగా, ఒక విజయ పతాకంగా కనిపిస్తుంది. మన కళ్ళ ఎదుట నిర్మించబడుతున్న చరిత్రకు చిహ్నమైన ఈ ఆనకట్టను చూసి, ఒక గంటకు పైగా ఆ ప్రాంతమంతా తిరిగి, పురాతన చరిత్ర చిహ్నమైన హంపి శిథిలాలను చూడటానికి బయలు దేరాము. తిరిగి హాస్పేట చేరుకుని ప్రయివేటు ట్రక్కులో సాయంత్రము ఆరు గంటలకు హంపి చేరుకున్నాము.

## నైసర్గిక స్థితి

హోసపేటకు ఉత్తరంగా నైరుతి నుండి ఈశాన్య దిక్కుగా తుంగభద్రానది ప్రవహిస్తున్నది. ఈనదిపై నేడు నిర్మించబడుతున్న ఆనకట్టకు 10 మైళ్ళ దిగువున హంపి విజయనగరం ఉన్నది.

హోసపేటనుంచి ఉత్తరంగా ప్రయాణంచేసి 4 మైళ్ళు పోగానే హంపి శిథిలాలు ప్రారంభమౌతాయి. శిథిలమైన భవనాలు, కోటగోడలు, దర్వాజాలు అటూ ఇటూ చెల్లా చెదరుగా ఉన్నవి. కొండలమీదుగా, గట్టులమీదుగా ప్రయాణంచేసి, మా ట్రక్కు పోయి పోయి హంపి విరూపాక్ష స్వామి దేవాలయము ముందు ఆగింది.

విజయనగర శిథిలాలలో నేటికి కొంతవరకు నిలచిఉన్నవి దేవాలయాలు మాత్రనే. రాజభవనాలు, కచ్చేరీలు, సభా భవనాలు పూర్తిగా ధ్వంసమై పునాదులు మాత్రమే మిగిలి ఉన్నవి. దేవాలయాలలో కూడా చాలావాటిలో విగ్రహాలు లేవు. అనేకం శిథిలావస్థలో ఉన్నవి. ఒక్క విరూపాక్ష స్వామి దేవాలయము, కోదండరామస్వామి దేవాలయాలు మాత్రం నేటికీ నిలచి అనేకమంది యాత్రికులను ఆకర్షిస్తున్నవి.

## నగర దృశ్యము

మొత్తం హంపి విజయనగరము 30 చదరపు మైళ్ళ ప్రాంతంలో వ్యాపించి ఉంది. విరూపాక్షస్వామి దేవాలయం ప్రక్కనే ఉన్న హేమకూటము అనే గుట్టపైకి

ఎక్కి నాలుగువైపుల చూశాము. ఎటుచూచినా కొండల పంక్తులు; కాని మధ్య శిథిలమైన భవనాలు, ఆ భవనాలను ఆనుకొని ప్రవహిస్తున్న నీటి కాలువలు, మధ్య మధ్య సమతల ప్రాంతంలో రైతులు పండిస్తున్న పంటచేలు, ఉత్తరపువైపు కొండల మధ్యగా ధ్వనిచేసుకుంటూ ప్రవహిస్తున్న తుంగ భద్రా స్రవంతి.

14 వ శతాబ్దంలో మహమ్మదీయ దండయాత్రను ప్రతి ఘటించటానికి కృష్ణకు దక్షిణాన స్థాపించబడ్డ హిందూసామ్రా జ్యము విజయనగరము. తుంగభద్రకు అవతలి ఒడ్డు హైద్రా బాదు. ఈనాడు హైద్రాబాదు రాజ్యం ఆనాడు బహ మనీసుల్తానుల రాజ్యం. హిందూ మహమ్మదీయ సామ్రా జ్యాలకు తుంగభద్ర సరిహద్దు. నిరంతర యుద్ధ ప్రమాదా లకు లోనవుతున్న ఆరోజులలో ఈ నగర నిర్మాణము ప్రధా నంగా సైనిక రక్షణ దృష్ట్యా జరిగింది. కొండలు పెట్టని గోడలు. కొండల మధ్య ఖాళీ స్థలాలుంటే అక్కడ గోడలు నిర్మించారు. ఆ కొండలను చూస్తుంటే, అవి సహజమైన ప్రాకారాలుగా ఉపకరించేవని స్పష్టంగా గ్రహించగలము. విజయనగరాన్ని స్వయంగా చూచిన చరిత్రకారులు ఆనగరా నికి 7 ప్రాకారాలు గలవని, యూరపులోని మహానగరాల కంటే మిన్నగా ఆ నగరం ఉండేదని వర్ణించారు. 7 ప్రాకా రాలను పూర్తిగా గుర్తించలేకపోయినా, 3, 4 ప్రాకారాలను ఈనాటికీ మనము గుర్తించగలము.

అన్నిటికంటె లోపలగల ప్రాకారము రాణివాస ప్రాకారము. ఈ ప్రాకారపు గోడ నేటికీ పూర్తిగా నిలచి ఉంది. ఈ ప్రాకారపు చుట్టుకొలత 1 మైలు. ఇందులో అంతఃపురము, కమలమహాల్, అనే రాణివాస భవనము 2, 3 జలక్రీడా మందిర శిథిలాలు చుట్టూ కాపలా బురుజులు ఉన్నవి.

ఈ ప్రాకారాన్ని చుట్టుకొని మరొక పెద్ద ప్రాకారముంది. దీని చుట్టుకొలత 3 మైళ్ళకు పైగా ఉంటుంది. ఇందులో భువన విజయమని ప్రసిద్ధిగాంచిన కృష్ణరాయల సభా భవనం, కృష్ణరాయల నివాస స్థలమైన రాజమహాల్, మహార్నవమిదిబ్బ, కచ్చేరీలు, టంకసాల, దండనాయకుని నివాసము, హజారి రామస్వామి దేవాలయము, ఏనుగశాలలు, మరికొన్ని జలక్రీడా మందిరములు ఉన్నవి. ఈప్రాకారపు గోడలు దాదాపు పూర్తిగా శిథిలమైనవి.

ఈ ప్రాకారాన్ని చుట్టుకుని మరొక ప్రాకారమున్నది. దీని చుట్టుకొలత 6 మైళ్ళు ఉంటుంది. ఇందులో పాతాళ విరూపాక్షస్వామి దేవాలయము, కృష్ణస్వామి దేవాలయము, చంద్రశేఖర దేవాలయము, ఉగ్రనరసింహ, వీరభద్ర, మహాలింగ, చండికేశ్వర - ఇత్యాది చిన్న చిన్న దేవాలయాలు ఉన్నవి.

దీనిని కూడా చుట్టుకుని వున్న నాలుగవ ప్రాకారము చుట్టుకొలత మొత్తం 10 మైళ్ళు. ఇందులో పైన చెప్పినవి గాక, హేమకూటము, విరూపాక్ష స్వామి, కోదండరామ స్వామి, విఠలాలయము, అచ్యుతరాయ దేవాలయము మొద

లైనవన్నీ ఉన్నవి. ఈ నాలుగు ప్రాకారాల వరకు మనము గుర్తించగలము.

కొండ పంక్తులలో మరికొంతదూరం సంచారం చేస్తే మిగతా మూడు ప్రాకారాలను కూడా గుర్తించవచ్చు. తుంగభద్రకు అవతలి ఒడ్డున 4 మైళ్ళ దూరంలో ఉన్న ఆనెగొంది, దక్షిణాన 8 మైళ్ళ దూరంలో ఉన్న హోసపేట, తూర్పున 12 మైళ్ళ దూరంలో ఉన్న కంపెనీ ఇవన్నీ ఆఖరు ప్రాకారంలో భాగాలుగా ఉండేవి. ఈ 7వ ప్రాకారం చుట్టు కొలత 30 మైళ్ళకు పైగా ఉంటుంది. విజయవాడ - గుంటూరు - తెనాలి నగరాలకు మధ్య ఒక మహానగరము నిర్మించబడితే ఎంత విస్తృతిగల పట్టణము ఏర్పడుతుందో అందులో సగానికి పైగా ప్రాచీన విజయనగర ముండేదని గ్రహించవచ్చు.

తమిళ, ఆంధ్ర, కన్నడ ప్రాంతా లన్నిటిని జయించి 6, 7 కోట్ల ప్రజలపై ఏకచ్ఛత్రాధిపత్యం వహించిన ఒక మహాసామ్రాజ్యానికి అది రాజధానిగా ఉండేది. విజయనగర రాజులు యుద్ధానికి వెళ్ళేటప్పుడు 7 లక్షలు మొదలు, 10 లక్షలవరకు సైన్యాన్ని సమీకరించే వారని, కోటలో ఎల్లప్పుడూ 3 లక్షలకు పైగా స్థిర సైన్యం ఉండేదని, పెయిస్ మొదలైన పోర్చుగీసు చరిత్రకారులు వర్ణించారు.

రాజధాని అక్కడ ఏర్పరచుటకు ఈ క్రిందివి ప్రబలమైన కారణాలుగా ఉండి ఉండాలి. కొండలు సహజ రక్షణ శ్రేణిగా ఉన్నవి. తుంగభద్ర ప్రవహించుటవల్ల నీటి కొరత

లేదు. కొండల మధ్య, చుట్టుపక్కల ఉన్న భూమి నల్లరేగడి. సారవంతమైన భూమి. రోహిణీకార్తెలోసైతం చెఱకుపంటను పండిస్తూనే ఉన్నారు. ఈ ప్రాంతం ఆంధ్ర, కన్నడ ప్రాంతాలకు మధ్యగా ఉంది. నదిని దాటితే హైద్రాబాదు రాజ్యం. కనుక శత్రు రాజులను అటకాయించటానికీ, వీలైతే వారి వీరాదికి దూకటానికి అనువైన ప్రాంతం. వీటన్నిటికి తోడు రామాయణకాలంనాటి కిష్కింధ నగరము ఈ ప్రాంతంలోనిదే. కిష్కింధనగర శిథిలాలపైననే, హంపివిజయనగరము నిర్మించబడ్డది. తుంగభద్రకు ఇవతలిఒడ్డున మాతంగపర్వతము, అవతలి ఒడ్డున ఋష్యమూక పర్వతము ఉన్నవి. ఒక మైలుదూరంలో మాల్యవంతం ఉన్నది. నేటి ఆనెగొంది ఆనాటి వాలి రాజధాని. ఆనెగొంది నుండి కమలాపురం వెళ్ళే త్రోవలో వాలి కాష్టం అని ఒక ప్రాంతాన్ని, ఏడు తాటిచెట్లను శ్రీరాముడు పడగొట్టిన చోటని మరొక ప్రాంతాన్ని చూపుతారు. మాతంగ పర్వతంలో సుగ్రీవుని గుహ, ఆంజనేయ నివాసము, సీతాదేవి నగలమూటను వదలినచోటు అనికూడ కొన్ని స్థలనిర్దేశాలున్నవి. ఆనెగొందికి దగ్గరగా పంపా సరస్సు దానిప్రక్కనే శబరి మఠం ఉన్నవి. కిష్కింధానగర శిథిలాలపై, 14 వ శతాబ్దంలో హంపీ విజయనగరం నిర్మించబడ్డదనటంలో ఎట్టి సందేహము లేదు.

## దేవాలయాలు

నగరంనిండా ఎక్కడ చూచినా దేవాలయ చిన్నవీ, పెద్దవీ మొత్తం 30 దేవాలయాలున్నవి. ? మతంలోని వివిధ శాఖలకు చెందిన దేవాలయాలు

గాక జైనమతాలు గూడా ఉన్నవి. హేమకూటంపైన, 5,6 జైన దేవాలయాలున్నవి. దానిప్రక్కనే ఒక వీరశైవ మఠం ఉంది. ఇప్పటికీ చెక్కుచెదరకుండా ఉన్న విరూపాక్షస్వామి దేవాలయం అన్నిటిలోకి అతి ప్రాచీనమైనది, అతి ఉన్నతమైనది. విజయనగర రాజ్యస్థాపన చేసిన విద్యారణ్యస్వామి ఆ దేవాలయాన్ని నిర్మించారట. ఈ దేవాలయం వెనుక భాగంలో విద్యారణ్యస్వామి మఠం, ఆయన విగ్రహంఉన్నది. ఆ దేవాలయం నుండి సరాసరి తుంగభద్ర నదిలోకి వెళ్ళేందుకు మెట్లున్నవి.

ఈ దేవాలయానికి ఎదురుగా 2 ఫర్లాంగుల పొడుగున అతివిశాలమైన వీధి ఉంది. వీధికి రెండువైపులా మంటపాలు ఇప్పటికీ నిలచి ఉన్నవి. నాటి హంపి గ్రామం ఇదే.

ఈ మంటపాలు చాలావరకు నేడు ప్రజలు నివాసస్థలాలుగా చేసుకున్నారు. హోటళ్ళు, దుకాణాలు ఇందులోనే ఉన్నవి. ఈ వీధి వెడల్పు 50 గజాలుంటుంది. ఇంతటి విశాలమైన వీధులు ఆధునిక నగరాలలో సైతం లేవంటే ఆశ్చర్యంలేదు. ఈ వీధి రెండవ చివర విరూపాక్ష దేవాలయం ద్వారానికి ప్రణమిల్లుతున్నట్టుగా ఒక బ్రహ్మాండమైన నంది విగ్రహం ఉంది. దానిపేరు ఎదురు బసవన్న. విరూపాక్ష దేవాలయం శివాలయం. అందువల్ల శివుని వాహనమైన నంది విగ్రహాన్ని దేవాలయానికి ఎదురుగా 2 ఫర్లాం... దూరంలో ప్రతిష్టించారు. ఆ నంది ఎత్తు నాలుగు ...ంటుంది. అరమైలు దూరంనుంచే ఆ విగ్రహాన్ని ...వచ్చు.

అన్ని దేవాలయాలు ఇదే నమూనాలో నిర్మించ బడ్డవి. ఒక దేవాలయం దానికెదురుగా పెద్దవీధి. వీధికిరెండు వైపులా మంటపాలు, ఇళ్ళు, దాని చుట్టుప్రక్కల ఆనుకొని ఊరు. విరూపాక్ష దేవాలయంచుట్టూ ఉన్న పేట పేరు పంపా పురం. అదేవిధంగా, అక్కడికి 2 మైళ్ళ దూరంలోఉన్న ...లాలయం చుట్టూ ఉన్న పేట విఠలాపురం. విరూపాక్ష ...వాలయాని కెదురుగాఉన్న విదురు బసవన్న విగ్రహం ...నుక మాతంగ పర్వతం ఉన్నది. ఆపర్వతం ఎక్కి అవతలకు దిగితే అచ్యుతరాయ దేవాలయం. ఆ దేవాలయం చుట్టూ ఉన్న పేట వేశ్యావాటిక. ఈపద్ధతిలో నాటి విజయనగరం నిర్మించబడ్డది. మత ప్రాతిపదిక ప్రజలను ఐక్య పరచవలెననే ఉద్దేశంతో నిర్మించ బడ్డనగరం కావటంవల్లనే ఇలా జరిగింది.

దేవాలయాలలో అతి ప్రాచీనమైనవి శైవాలయాలు. విజయనగర రాజులు మొదట్లో శైవభక్తులు. కృష్ణదేవ రాయల కాలంలో వైష్ణవం ప్రవేశించింది. విజయనగరంలోని వైష్ణవ దేవాలయాలన్నీ కృష్ణదేవరాయలు నిర్మించినవే. ఉదయగిరి ముట్టడి అనంతరం కృష్ణస్వామి దేవాలయాన్ని, రాయచూరు ముట్టడి అనంతరం విఠోభా దేవాలయాన్ని, అటు తర్వాత నది ఒడ్డున కోదండ రామస్వామి దేవాలయాన్ని, రాణివాస ఉపయోగార్థం, హజారి రామస్వామి దేవాలయాన్ని కృష్ణ దేవరాయలే నిర్మించాడు. శిల్ప దృష్ట్యా దీనిలో హజారి రామస్వామి దేవాలయం ఉన్నతమైనది. అక్కడ మంటపంలో వాడిన రాయి నల్లరాయి. ఆరాతిమీద, రామాయణ, భారత, భాగవత గాథలన్నీ చిత్రించబడి నేటికీ చెక్కు

చెదరకుండా ఉన్నవి. విఠోబా దేవాలయ స్తంభాలలో, సంగీత ధ్వనులిచ్చే స్తంభాలున్నవి.

ఒకరాయి తీసుకుని ఆ స్తంభాలను వాయించాము. వేణె తీగెను మీటితే వచ్చే ధ్వనులు వచ్చాయి. ఆ రాతి స్తంభాల లోపలి భాగాన్ని తొలచి, బోలుగా చేసి రకరకా ధ్వనులను పలికించగలిగిన నాటి శిల్పుల పనితనం ప్రశంసార్హ

## రాజభవనాలు

దేవాలయాలను కాస్తో కూస్తో నిలవ నిచ్చిన మహమ్మ దీయ విజేతలు, రాజభవనాలను మాత్రం పూర్తిగా ధ్వంసం చేశారు. అయినప్పటికి, రాయల సభాభవనం భువనవిజయ పునాదిఇప్పటికీ చెక్కు చెదరకుండా ఉంది.

ఈ సభా భవనంలోనే అల్లసాని పెద్దన. ముక్కు తిమ్మన, భట్టుమూర్తి మొదలైన అష్టదిగ్గజాలవంటి పండితుల కొలువు జరుగుతూ ఉండేది. మనుచరిత్రమున అల్లసాని పెద్దన వర్ణించినట్లు.

"భువన విజయాఖ్య సంపత్
భవనస్థిత భద్రపీఠి ప్రాజ్ఞుల గోష్ఠిన్,"

కృష్ణరాయలు సభ తీర్చేవాడు.

ఈ సభా భవనానికి పక్కనే రాజ మహల్ పునాదు లున్నవి. ఇది కృష్ణరాయల నివాస స్థలము. దీని కెదురుగా దసరాదిబ్బ అను ప్రసిద్ధి చెందిన వేదిక ఉంది. ఈ వేదికపైన ఎక్కి నిలుచుంటె విజయనగర దృశ్యమంతా కనబడుతుంది. సైన్యాలకవాతును, గుఱ్ఱపు స్వారీలను, నృత్య, గాత్ర వినో

దాలను చూసేందుకు, ఈ వేదికపైన కృష్ణరాయలు ఆసీను డయ్యేవాడు. రాజమహల్ పక్కనే రాజుగారి స్నాన మంది రము ఉంది. తుంగభద్రలోని నీరు రాతి కాలవలద్వారా ఈ భవనంలోకి వస్తుంది. ఈ కాలవలు నేలమట్టానికి 2 గజాల ఎత్తున నిర్మించబడ్డవి. నేటికి శిథిలమైన ఈ రాతి కాల్వలను చూడవచ్చు.

వీటికి పశ్చిమంగా, టంకసాల, కచేరీలు, దండనాయ కుని హావేలీ, ఇతర గుమాస్తాల ఆఫీసులు ఉన్నవి. వీటన్నిటి లోకి దండ నాయకుని హావేలీ మాత్రమే నేటికీ నిలచిఉంది.

మహర్నవమి దిబ్బకు ఉత్తరదిక్కున అంతఃపురం ఉంది. ఇందులోని కమల మహల్ అను రెండతస్తుల మేడ ఇప్పటికీ చెక్కుచెదరకుండా ఉంది. పద్మము ఆకారంలో గుండ్రంగా పాలగచ్చుతో ఈ భవనం నిర్మించబడ్డది. విజయనగర శిథిలాలన్నిటిలోకి, చెక్కు చెదరకుండా, నిన్ననో, మొన్ననో నిర్మించబడ్డ భవనంలాగా ఉన్నది ఈ కమల మహల్ ఒక్కటే. ఈ అంతఃపురానికి తూర్పుగా గజశాలలున్నవి. జలక్రీడా మందిరాలకు లెక్కలేదు.

కాని ఒక్క మందిరము విషయం మాత్రం చెప్పవలసి ఉంది. రాజభవనాలకు కొంచెం దూరంగా ఒక భవనంఉంది. ఆభవనంపైన Queen's Bath, రాణిగారి స్నానమందిరం అని బోర్డుఉంది. బైటికి మామూలు మేడవలెనే ఉన్న ఈ భవనం లోపల పాలగచ్చుతో నిర్మించబడ్డ ఒక కృత్రిమ సరస్సు ఉంది. దానిలోపలికి నీరు రావటానికి, తిరిగి బైటికి పోవ టానికి కాలువలున్నవి.

నగర వర్ణన ముగించేముందు ఒక విషయం చెప్పాలి. బ్రహ్మాండమయిన కొండరాళ్ళు ఎక్కడచూచిన కుప్పతెప్పలుగా విజయనగరంనిండా ఉన్నవి. ఆ కొండరాళ్ళను కొన్నింటిని విగ్రహాలుగా చెక్కారు. మరికొన్నిటిని త్రోవకడ్డం లేకుండా తప్పించి పక్కకు నెట్టారు. ఉగ్రనరసింహస్వామి, మహాలింగం, వీరభద్రస్వామి, శెనగగింజ గణపతి, ఆవగి గణపతి, విగ్రహాలు విరూపాక్షస్వామి దేవాలయానికి ర భవనాలకు మధ్యఉన్న ఒక మైలుప్రాంతంలో అక్కడక్క ఉన్నవి. పై విగ్రహాలలో ప్రతిదీ విమరు బసవన్నలాగా నాలుగు గజాలకంటె ఎత్తైనది. ప్రతిదీ 2 ఫర్లాంగులనుంచి చూడవచ్చు. ఉగ్రనరసింహస్వామి విగ్రహము, ఈ రోజులలో రెండతస్థుల మేడ అంత ఎత్తున వున్న ఒకే ఒక రాయి.

పై విగ్రహాలు కాక అక్కచెల్లెండ్రగుళ్ళు అని, సీతా రాముల గుళ్లు అని, కొండరాళ్ళు త్రోవకడ్డంగా ఉంటవి. కోదండ రామస్వామి దేవాలయానికి వెళ్ళే త్రోవలో సీతా రాముల గుళ్లు ఉన్నవి. ఒక్కొక్కరాయి ఒక మేడ అంతస్తు అంత ఉంది. ఈ రెండు ఒక దానిపైన ఒకటి వ్రాలి ఉన్నవి. కిందుగా గాఢాంధకారంలోగుండా 10 గజాలు నడచిన మీదట దేవాలయం వస్తుంది. ఇదే విధంగా హేమకూటం అనేచోట మార్గం కొండ బిలంలోగుండా ఉంది. రాళ్ళు పైనపడతయ్యా అన్నంతవదులుగా ఒకదానిమీద ఒకటి వాల్చినట్లు ఉన్నవి.

విజయనగర భవనాలన్నీ గుట్టలమీద ఉన్నవి. నదిలో నుండి ఈ భవనములకు నీటిని సప్లయిచేసేందుకు రాతికాల

వలు విస్తారంగా ఉన్నవి. 10 మైళ్ళ వైశాల్యంలో ఉన్న మాగుమూల ప్రాంతాలకు సైతం తుంగభద్ర నీరు పారించ బడుతున్నది. పాతాళ విరూపాక్ష దేవాలయము, మహా లింగం-రెండూ సంవత్సరం పొడుగున సగంవరకు నీళ్ళలోనే ఉంటాయి. అవసరమైనపుడు ఆ రెంటిని పూర్తిగా నీళ్ళతో ింపటానికి తగిన ఏర్పాట్లు కూడా ఉన్నవి.

## ంభుత్వా బాధ్యత

ఉదయం 7 గంటల నుండి మధ్యాహ్నం 1 గంటవరకు మొత్తం 7 మైళ్ళు ఆ కొండలలో, గుట్టలలో తిరిగి తిరిగి, 2 గంటలకు హోసపేట చేరుకున్నాము. త్రోవ చూపించ టానికి ఏర్పరచుకున్న గైడ్ నడవలేక, "రాళ్ళలో ఏమున్న దండీ అన్నీ ఒకేరకపు రాళ్ళండీ" అని ఎంత నిరుత్సాహ పరచినా వినకుండా, అతనిని వదలి ఒంటరిగా కూడా తిరిగి ముఖ్యాతిక వంతు చూడవలసిన వన్నీ చూచాము. అన్నీ ఒకేరకపు రాళ్లు నిజమే. కాని ఒకొక్క రాతికి వెనుక ఎన్ని చరిత్రలు, ఎన్నిగాధలు! వేల సంవత్సరాల నాటి రామా యణ గాధలు జరిగినప్రాంతం ఇదే. 500 సంవత్సరాల క్రితం బ్రహ్మాండమైన సామ్రాజ్యానికి రాజధానిగా ఉన్నది ఈ ప్రాంతమే. ఆ రాళ్ళను ఎత్తి, భవనాలను నిర్మించిన కూలీల స్వేదజలం, వానిపై సజీవమైన శిల్పాలను వేల సంఖ్యలో చెక్కిన శిల్పుల పనితనము, ఈ మహా నగరాన్ని నిర్మించి, 2 శతాబ్దాలపాటు దక్షిణాపథాన్ని పరిపాలించిన రాజుల రాజ నీతి, అంతఃకలహాలలో నిరంతర యుద్ధాలలో ప్రాణా లర్పించిన లక్షలాది వీరుల శౌర్య సాహసాలు, ఆ వీరులను

రణరంగంలోకి దుమికించిన మతావేశం, రాజభక్తి - జాతి జీవితంలో ప్రధాన పాత్ర వహించిన పై మహాశక్తుల కన్నిటికీ సాక్షీభూతంగా నేటికి నిల్చినవి ఈ రాళ్లే.

విజయనగరం చూడటానికి యాత్రికులు అనేకులు సంవత్సరం పొడుగునా వస్తూనే ఉంటారు. కాని వారిలో ముప్పాతికవంతు, మతభావంతో, విరూపాక్ష స్వామి దేలయము తదితర దేవాలయాలు చూడటానికి వచ్చేజను. ఈ యాత్రీకులకు చారిత్రక దృష్టి కలిగించి నగర ప్రాముఖ్యతను వివరించవలసిన బాధ్యత ప్రభుత్వంపైన ఉన్నది. కాని ఈవిషయంలో ప్రభుత్వ పురావస్తు శాఖవారు చేస్తున్న కృషి దాదాపు పూజ్యం. అక్కడక్కడ శిథిల భవనాలకు కొన్ని బోర్డులు తగిలించడం మాత్రం వీరు చేశారు. పురావస్తుశాఖ ఉద్యోగి ఆఫీసు తెలుసుకోవలెనని మేము ఎంత ప్రయత్నించినా మాకు, హాసపేటలోగాని, కమలాపురంలోగాని లభించలేదు. దేవాలయాలవద్ద కాచుకు కూచున్న యాత్రీకులును ఆ మూలకు ఈ మూలకు తిప్పే గైడ్లు మాత్రమే మాకు దిక్కయినారు. ఇది మన ప్రభుత్వం ప్రాచీన శిథిలాల విషయమై వహిస్తున్న నిర్లక్ష్య వైఖరికి స్పష్టమైన నిదర్శనం.

(20-6-54)



# సాలిహుండాం

శ్రీకాకుళంజిల్లా కళింగదేశానికి నడిబొడ్డు. ఆంధ్ర ప్రజలలో అంతర్భాగమైన కళింగ ప్రజల ప్రత్యేక నాగరికత శ్రీకాకుళం జిల్లాలో పుట్టి, పెరిగి వికసించింది.

క్రీ. పూ. 500 — 100 సంవత్సరాల మధ్య, బౌద్ధ యుగపు ప్రభావము కళింగదేశమంతటా వ్యాపించింది. నాడు పేరుగాంచిన నగరాలు దంతపురం, సింహపురం, బౌద్ధ జాతక కథలలో తరచు ప్రస్తావించబడ్డాయి. నాటి దంతపురము ఈ నాడు దంత వక్త్రునికోట అని పిలువబడుతూ శ్రీకాకుళానికి సమీపంలోనే ఉంది. నాటి సింహపురం, ఈనాడు సింగుపురం అనే పేరుతో శ్రీకాకుళానికి 15 మైళ్ళలో ఒక చిన్న కుగ్రామంగా ఉంది.

క్రీ. పూ. 250 లో అశోకుని కళింగ దండయాత్ర జరిగింది. ఆనాటికి శ్రీకాకుళం జిల్లానుండి కటకం వరకు కళింగదేశమని వ్యవహరించబడేది. అశోకుని శాసనాలు గంజాం జిల్లాలో బయల్పడ్డవి.

బహుశా అశోకుని దండయాత్ర తర్వాత కళింగ ప్రజలు కొంచెం దక్షిణంగా కదలి ఉంటారు. 600 సంవత్సరాల తర్వాత క్రీ॥ త॥ 350 లో సముద్రగుప్తుడు దండయాత్ర చేసే సమయానికి, పిఠాపురంవరకు కళింగ ప్రజలు వ్యాపించారు. ఆనాడు పిఠాపురం కళింగ రాజధానులలో ఒకటి.

అటు తర్వాత విష్ణుకుండిన, తూర్పు చాళుక్యుల కాలంలో విశాఖజిల్లా అంతా కళింగ రాజుల పరిపాలనలో నుండి జారిపోయింది. క్రీ॥ శ॥ 500 నుండి 1100 వరకు, ముఖలింగం కళింగ రాజధానిగా ఉండేది. కళింగ ప్రజలు తిరిగి తమ నడిబొడ్డు అయిన శ్రీకాకుళంజిల్లాకు మాత్రమే పరిమితమైనారు.

క్రీ॥ శ॥ 1100 లో కళింగ రాజైన అనంతవర్మ చోడగంగదేవు ఉత్తరదేశ దండయాత్ర ప్రారంభించి కటకంవరకు వెళ్లాడు. కటకం ఆక్రమించుకొని తన రాజధానిని కూడా అక్కడకు మార్చాడు. దాంతో కటకం కళింగదేశానికి రాజధాని అయింది. బౌద్ధయుగంనాడు కటకం చుట్టు ఉన్న ప్రాంతం ఉత్తర కళింగం, అని వ్యవహరించబడ్డది. క్రమంగా అదే ఉత్కళరాష్ట్రమైంది.

క్రీ॥ శ॥ 600 ప్రాంతం నుండి ఆంధ్రదేశంలోని కాళింగులు తెలుగు భాషను, ఉత్కళంలోనివారు ఒరిస్సాను స్వీకరించారు. దాంతో కటక ప్రాంతవాసులు ఒరిస్సావారై పోయినారు. తిరిగి ఒక్క శ్రీకాకుళంజిల్లా మాత్రమే కళింగ ప్రజలకు మిగిలింది.

## నైసర్గిక పరిస్థితి

శ్రీకాకుళం జిల్లా సముద్రతీరంవెంట మొత్తం 200 మైళ్ళ పొడుగునా ఉంది. తీరానికి 50, 60 మైళ్ళ లోపలికి వెళ్ళగానే ఎత్తైన కొండలు, ఆ వెనుక కీకారణ్యాలు ఉన్నవి. ఆ కొండలలో పుట్టి వందమైళ్లు మాత్రం ప్రవహించే చిన్న నదులు నాగావళి, వంశధార. ఈరెండు గాక మహేంద్ర

తనయ అనే పేరుతో రెండు వాగులున్నవి. ఈరెండు మందసా సమీపంలో ఉన్న మహేంద్రగిరిలో పుట్టి, ఒకటి సోంపేట తాలూకాలోని బారువాసమీపంలో సముద్రంలో కలుస్తుంది. మరొకటి పర్లాకిమిడివైపుగా ప్రవహిస్తున్నది.

వంశధారనది శ్రీకాకుళం జిల్లాకు జీవనది. ఈనాడు ...త్రమేగాక పూర్వకాలంనుండి కళింగ నాగరికత ఈ నది ...ంటనే వికసించింది. పైన చెప్పిన దంతపురం, సింహపురం, ...ండూ వంశధారకు దగ్గరలో వున్నవి. ఈ రెండు మాత్రమే ...క, వంశధార సముద్రంలో కలిసే కళింగ పట్నానికి మూడు మైళ్ల ఎగువన సాలిహుండాం అనే బౌద్ధ ఆరామాలుగల కొండ ఉంది. నదికి ఇంకా ఎగువగా 30 మైళ్లు వెళ్లితే, ప్రసిద్ధమైన ముఖలింగం ఉంది.

## సా లి హుం డాం

ఈమధ్య ఒక మిత్రునితో కలిసి సాలిహుండాం, ముఖలింగం, ప్రాంతాలు చూసే అవకాశం లభించింది. శ్రీకాకుళంనుండి బయలుదేరి కళింగపట్నం వైపుగా వెళ్లే రోడ్డులో 15 మైళ్లు వెళ్లగా సాలిహుండాం మధ్యాహ్నం 12 గంటల వేళకు చేరుకున్నాము. కొండక్రింద ప్రభుత్వ పురావస్తు శాఖ వారి గుడారాలున్నవి. కొండపైన 200 మంది కార్మికులు త్రివ్వుపని సాగిస్తున్నారు.

రోడ్డు పక్కన ఉన్న పాకలో ఇంత టీ త్రాగి, కొండ వైపు బయలుదేరాము. పురావస్తుశాఖ ఉద్యోగులు అప్పుడే జీపుకారులో కొండపైకి వెళ్ళుతున్నారు. మమ్ములను కూడా అదే జీపులో కొండపైకి చేరవేశారు.

తవ్వకపు పని చురుకుగా సాగుతున్నది. వలయాకారములోని బౌద్ధ స్తూప చిహ్నాలు ఇప్పటికి సుమారు పది బయటపడ్డవి. కొండ శిఖరాన, 12 అడుగుల వ్యాసం, 30 అడుగుల లోతుగల బావిలాంటి ఒక నిర్మాణం చూశాము. బౌద్ధయుగంనాటి పెద్ద, ఎర్రని ఇటుకలతో దాని గోడలు నిర్మించబడి ఉన్నవి. ఈ బౌద్ధ స్తూపం నమూనామధ్య వున్నన్ను, ఇతర శిధిలాలను ప్రభుత్వంవారు తీసి భద్రపరచారు కనుక ఇది చూడటానికి ఒక దిగుడుబావివలె వుంది. ఈబావి అడుగున ఒక రంధ్రం వున్నదని, కొన్ని వందల గజాల వరకు ఆ రంధ్రం వ్యాపించిన చిహ్నాలున్నవని, కొండ అంతా తవ్వటం సాధ్యంకాదు గనక, ఆ రంధ్రాన్ని పూడ్పించి వేశామని అధికారులు తెలియజేశారు.

ఇదే నమూనాలో ఉన్న వర్తులాకారపు స్తూపాలు మాత్రమే గాక, కోణాకారంలో కొన్ని, చతురస్రాకారంలో కొన్ని నిర్మాణాలు బైటపడ్డవి. బుద్ధుని విగ్రహాలు, కొన్ని నాణెములు బైటికి తీయబడ్డవి. ఈ కొండ అంతటా ఇలాంటి శిధిలాలు ఉన్నవి,

క్రీ. పూ. 250 కి ముందే ప్రారంభించబడి, తర్వాత అభివృద్ధిచేయబడిన అమరావతి, నాగార్జునకొండ బౌద్ధ కేంద్రాలవలెనే, సాలిహుండాం కూడా ఒక సుప్రసిద్ధ బౌద్ధ కేంద్రం. ఇక్కడ వెలువడిన విశేషాలను ప్రభుత్వం ఇంకా ప్రకటించలేదు. త్వరలో ప్రకటిస్తామని అక్కడ వున్న ప్రభుత్వోద్యోగి తెలియజేశాడు.

కొండపైకి వెళ్ళాము. కొండను ఆనుకొని వంశధారా నది సన్నగా శబ్దముచేస్తూ నిదానంగా ప్రవహిస్తున్నది. ఎప్పుడో వర్షాకాలంలో వరదలు వచ్చినపుడు తప్ప, మిగతా కాలంలో వంశధారలో లోతు ఒక నిలువుకు మించదు. నదికి ఆవలి ఒడ్డున కొండకు ఎదురుగా ఒక గ్రామం ఉంది. దాని పేరు వనితామండలం. తూర్పుగా మూడు మైళ్ళలో బంగాళా ఖాతం. వంశధార సముద్రంలో కలిసేచోట కళింగపట్నం. సముద్రపు తీరమంతటా దట్టమైన జీడిమామిడి తోటలు.

ప్రాచీన కళింగ ప్రజలు, జావా, సుమత్రా, బోర్నియో దీవులకు విస్తారంగా వలస వెళ్లేవారు. కొండ ప్రాంతమైన కళింగ సీమలో, జీవనం జరగక కొందరు, వ్యాపారానికి కొందరు, మత ప్రచారానికి మరికొందరు వేలకువేలు క్రీ.పూ. 400-200 సంవత్సరాల మధ్య కళింగదేశంనుండి తూర్పు దీవులకు మలయా, సింహళాలకు వెళ్లినట్లు చరిత్ర తెలియజేస్తున్నది. కళింగపట్నంరేవులో పడవలనెక్కి, తమ జన్మభూమికి కడసారి వీడ్కోలిచ్చి, సాహసికులైన ఆ పూర్వీకులు నెలల పర్యంతం సముద్రయానంచేసి తూర్పుదీవులను చేరుకునేవారు. ఇట్టి స్థలంలో సాలిహుండాం బౌద్ధారామం నిర్మించబడ్డది. నాటి కళింగ ప్రజాజీవితంలో ప్రముఖస్థానం ఆక్రమించిన ఈ విదేశయాత్రలకు, బౌద్ధభిక్షువులు, నాయకులు, ప్రోత్సాహకులు, మార్గదర్శకులుగా వుండేవారు.

వాస్తవ చరిత్ర ఇలా ఉండగా సాలిహుండాంను గురించిన ఒక కల్పితగాథ, ప్రచారంలో వుంది. 12 వ శతాబ్దిలో రామానుజులవారు కళింగదేశంలోని అనేక దేవాలయాలను

వైష్ణవాలయాలుగా మార్చి కొన్ని స్థల పురాణాలను, మహాత్మ్యాలను సృష్టించారు. సాలిహుండాంకు 10 మైళ్లలో వున్న శ్రీకూర్మం అలాంటి వైష్ణవ దేవాలయము శ్రీ కూర్మ క్షేత్ర మహాత్మ్యము అనే పేరుతో ఈగాథ ప్రజలలో ప్రచారంలో ఉంది.

ద్వాపరయుగంలో (క్రీ॥పూ॥ 1500 కు పూర్వం) శ్వేత కేతువు అనే రాజు సాలిహుండాంలో కోట గట్టుకొని పరిపాలించేవాడు. పక్కనే వున్న వనితామండలం అనే గ్రామం ఆయన రాణివాసంగా ఉండేది. ఒక ఏకాదశి పున్యాసమయాన, శ్వేతకేతువు రాణివాసానికి బయలుదేరాడు. అప్పుడు పట్టపురాణి, ఏకాదశీ వ్రతభంగం జరగకుండాను, రాజుగారిని తిరస్కరించకుండాను తనను కాపాడవలసిందిగా శ్రీ మహావిష్ణువును ప్రార్థించింది. అప్పుడు వెదురు బొంగులోనుండి నీటిధార (వంశధార) నదిగా ప్రవహించి రాజుగారి ప్రయాణాన్ని ఆపివేసింది. అటుపై రాజుగారు పశ్చాత్తాపపడి సన్యాసం స్వీకరించి శ్రీ కూర్మక్షేత్రంలో తపస్సు చేస్తూ కాలంగడిపాడు. ఇదీ కథ.

ఇది ఏకాదశి మహాత్మ్యాన్ని వర్ణించటానికి సృష్టించబడ్డ పుక్కిటిపురాణం అని వేరే చెప్పనక్కరలేదు.

## ము ఖ లిం గం

నాటి సాయంత్రానికి శ్రీకాకుళం తిరిగి వచ్చాము. మర్నాడు పొద్దుననే బయలుదేరి నరసన్నపేట మీదుగా 35 మైళ్లు ప్రయాణంచేసి 10 గంటలకల్లా ముఖలింగం చేరుకున్నా...

ఇక మూడు మైళ్లలో ముఖలింగం వస్తుందనగా నగరి కటకం అనే ఒక గ్రామం ప్రవేశించాము. ప్రాచీన రాజధానీ నగరమయిన ముఖలింగం వెలుపలి ప్రాకారం నగరికటకం వరకు ఉండేది. ఈ మూడుమైళ్ల వైశాల్యంలో పొలాలలో ఎక్కడ త్రవ్వినా ఏవో శిథిలాలు, బొమ్మలు, రాళ్లు, ఇప్పటికీ నపడుతూనే వున్నవి.

ముఖలింగ దేవాలయాన్ని చూడగానే, ఒరిస్సా దేవాలయాలు గుర్తుకొస్తాయి. భువనేశ్వర్‌లోని దేవాలయాలు, ముఖలింగం దేవాలయాలు ఒకే ఫక్కీలో నిర్మించబడ్డవి. గాంగవంశపు రాజులు, క్రీ. త. 500–1100 వరకు ముఖలింగం రాజధానిగా కళింగదేశాన్ని పరిపాలించేవారు. వారి కాలంలోనే ముఖలింగం దేవాలయాలు నిర్మించబడ్డవి. వీరిలో సుప్రసిద్ధుడైన అనంతవర్మ చోడ గంగదేవు (1055–1100) రాజరాజ నరేంద్రునికి సమకాలికుడు. ఇతని శాసనాలు అనేకం ముఖలింగం దేవాలయంలో ఉన్నవి. అనంతవర్మ చోడ గంగదేవు, చివరిరోజులలో కటకం ప్రాంతమంతా జయించి, రాజధానిని కటకానికి మార్చాడు. దాంతో ముఖలింగ ప్రశస్తి పతనమైంది. గాంగవంశపు రాజులు కటకానికి వెళ్ళినమీదట, తెలుగును వదలి, ఓఢ్రభాషను స్వీకరించారు. తెలుగు కాళింగులకు, వీరికిగల సంబంధాలు క్రమంగా తెగిపోయినవి. ఒరిస్సా రాజులుగా మారిపోయిన గాంగవంశపు రాజులు, ముఖలింగ దేవాలయ నమూనాలోనే తర్వాత కాలంలో భువనేశ్వర్‌లో వందలాది దేవాలయాలను నిర్మించారు.

ముఖలింగానికి పడమర, దక్షిణాన వంశధారానది ప్రవహిస్తున్నది. ఉత్తరాన ఎత్తయిన కొండలున్నవి. తూర్పున నగరికటకానికిపైగా కందకంవలె ఉపయోగపడే ఒక కాలవను వంశధారలో నుంచి త్రవ్వించారు. ప్రస్తుతం ఈ కాలువను కొమ్మనాపల్లి కాలవ అంటున్నారు. ఈ సహజ రక్షణ శ్రేణిమధ్య నాటి రాజధాని నగరము నిర్మించబడ్డది. వంశధార నదిలో దిగి, కట్టవైపు చూస్తే, ఇటుక పునాది ఒక మైలు పొడుగునా స్పష్టంగ కనిపిస్తున్నది. నదీప్రవాహానికి ఆనుకొని కోటగోడలు ఉండేవనటానికి ఇదే చక్కని నిదర్శనము. ముఖలింగానికి మూడు వైపుల ఎత్తయిన కొండలు. ఆ కొండలలో అనాదిగా సవర ప్రజలు నివశిస్తున్నారు. ముఖలింగ దేవాలయంలోని విగ్రహం మొదట నొక సవర రాజుచే ప్రతిష్టించబడిందని క్షేత్ర మహాత్మ్యంలో వివరించబడ్డది.

ప్రస్తుతం ఇదొక కుగ్రామం. ఈ దేవాలయంలోని అర్చకులు అందరూ, కాళింగులే. ఇది దీని ప్రత్యేకత. బౌద్ధ, జైనమత ప్రభావాలలో దీర్ఘకాలం నివసించిన కాళింగులలో కులభేదాలు చాలా కాలంవరకూ లేవు. విష్ణుకుండిన, చాళుక్యుల కాలంలో (క్రీ. శ. 400 - 1000) ఆంధ్రదేశంలోని బౌద్ధ జైన సంస్కృతి పూర్తిగా నశించి, కులభేదాలు సుస్థాపితమైనవి. తర్వాత ఎంతో కాలానికిగాని ఈ కుల వ్యవస్థ కాళింగులలో వ్యాపించలేదు. కళింగ, బ్రాహ్మణులు, కళింగ వైశ్యులు-అని వారిలోనే కొన్ని విభాగాలేర్పడ్డాయి. కాని ఈ కులాలమధ్య, ఇతర ప్రాంతాలలోవలె, బలమైన అడ్డుగోడలు నేటికీ లేకపోవటం హర్షించదగిన విషయం.

## ముఖలింగం శిల్పాలు

ముఖలింగంలో మధూకేశ్వరాలయం, భీమేశ్వరాలయం, సోమేశ్వరాలయం, అనేమూడు శైవదేవాలయాలున్నవి. ఇవి అన్నీ క్రీ. శ. 500 తర్వాత నిర్మించబడ్డవే. కాని అన్నిమతాలకు సంబంధించిన శిల్పాలు, విగ్రహాలు ఈ దేవాలయాలలో ఉన్నవి.

బౌద్ధమతం కళింగదేశంలో ప్రవేశించక పూర్వం, కొండజాతి ప్రజలలో శాక్తేయమతం, ప్రచారంలో వుండేది. మహిషాసురమర్దని రూపంలో శక్తిని పూజించుట, నరబలులు, జంతుబలులు విశేషంగా ఇవ్వటం ఈ మతంలో ఆచారాలు. ముఖలింగం చుట్టూఉన్న సవరప్రజలలో బహుశా చాలా కాలంవరకూ, ఈ మతం, ఆచారాలు నిలిచి ఉండి ఉండాలి. అందు వల్లనే, పైమూడు దేవాలయాలలోను ప్రాచీనమైన సోమేశ్వరాలయంపైన శక్తి పూజ, జంతుబలి, నరబలికి సంబంధించిన చిత్రాలు విస్తారంగా ఉన్నవి.

స్త్రీ పురుష సంబంధమైన కామ ప్రవృత్తి సృష్టికి మూలం. నాగరికత వికసించినకొలదీ ఈ కామ ప్రవృత్తిలోని కేవల భౌతికాంశాలను యథాతథంగా చిత్రించటం తగ్గింది. వాని ప్రతిబింబాలైన మానసిక చిత్తవృత్తులను మాత్రం సాధ్యమైనంత లలితంగా ప్రదర్శించటం ఈ నాడు నేర్చుకుంటున్నాము. కాని శాక్తేయ మతాన్ని అనుసరిస్తున్న నాటి సవర ప్రజల కళాదృష్టి సహజంగా చాలా ప్రాథమిక దశలో ఉండేది. సోమేశ్వర దేవాలయంపైన అనేక శృంగార

చిత్రాలున్నవి. నేటి దృష్టితో చూస్తే అవి చాలా అసభ్యమైనవి. కాని నాటి ప్రజల నాగరికతా స్థాయికి అవి కొలబద్దలు.

మిగతా దేవాలయాలలో కూడా విశేషంగా శిల్పాలున్నవి. శాక్తేయ మతం మొదలుకొని, బౌద్ధ, జైన, శైవ, వైష్ణవ మతాలకు సంబంధించిన చిత్రాలు, శిల్పాలు ఈ దేవాలయాలలో ఉన్నవి. వరుసగా వివిధమతాలు ఈ ప్రాంతంలో వ్యాపించినవని తెలుసుకోటానికి ఇది నిదర్శనం.

మధ్యాహ్నం మూడు గంటలకు వెనుకకు తిరిగినాము. ఆ సాయంత్రానికి టెక్కలి చేరుకున్నాము.

కళింగనాగరికతకు వంశధారా నది కేంద్రం. ఎన్నో నగరాలు, రాజ్యాలు, ఆనది ఒడ్డున పుట్టి, పెరిగి నశించినవి. కాని, ఆ పర్వతాలు; ఆనది, పాడీపంటని ఆబీడు భూములు, ప్రజలు సాక్షిభూతంగా నిలిచి ఉన్నారు నేటికి!

(4—4—54)

—:0:—

# కొందరు మహనీయులు

ఆంధ్రుల ప్రాచీన చరిత్రలోని కొన్ని చిరస్మరణీయములైన ఘటనలను, మహావ్యక్తులను, చరిత్రలో వారి ప్రాధాన్యాన్ని తెలుసుకొనుట అత్యావసరం. ఈ దృష్టితో పరిశీలించినప్పుడే ప్రాచీన చరిత్ర భవిష్యత్తుకు మార్గదర్శి కాగలదు.

అది శాతవాహనయుగం. ఆంధ్రులు స్థానికులైన నాగ, తెలుగు, యక్ష తదితర తెగలప్రజలలో లీనమై, ఒక సమగ్ర జాతిగా రూపొందుతున్న కాలమది. వివిధ తెగల ఆచార వ్యవహారాలు, మూఢ నమ్మకాలు అన్నీ, ఒకే మూసలో కాగి, కరిగి, ఒక నూతనాకృతిని స్వీకరిస్తున్న సమయమది.

స్థానికులైన నాగ, యక్ష తెగలు అశోకునికి పూర్వమే బౌద్ధధర్మాన్ని స్వీకరించారు. వారిలో కులభేదాలు లేవు. హెచ్చు తగ్గులు లేవు. భట్టిప్రోలులో క్రీ. పూ. 4 వ శతాబ్దంలో చెక్కబడిన కుబ్బీరకుని శాసనమే ఇందుకు నిదర్శనం. బౌద్ధగ్రంథాలలో ఆంధ్రదేశం నాగభూమిఅని, వజ్రదేశం అని వ్యవహరించ బడ్డది. బౌద్ధమతాన్ని స్వీకరించిన ఒకనాగరాజు అమరావతీ స్తూప నిర్మాణానికి మూల పురుషుడు. ఆంధ్ర, సింహళ దేశాలు ప్రాచీన బౌద్ధ ధర్మానికి నిలయాలు. సింహళ దేశం ఆనాడు నాగద్వీపమని. రత్నద్వీపమని వ్యవహరింప బడేది.

బౌద్ధధర్మాన్ని స్వీకరించిన ఈ తెగలతో [illegible] ధర్మాన్ని అవలంబించే ఆంధ్రులు కలిసి [illegible] వచ్చింది. కేవలం కలిపి జీవించటమే కాదు [illegible]

కోవటాలుకూడా తప్పలేదు. హిందూ బౌద్ధధర్మాల ఈ సమ్మేళనము శాతవాహన యుగసంస్కృతిలో విస్పష్టంగా గోచరిస్తుంది.

ఈ సంస్కృతీ పరిణామానికి నాయకుడు ఆచార్య నాగార్జునుడు. మనచరిత్రలో నాగార్జున నామధేయులు ఇద్దరున్నారు. మొదటివారు మహాయాన మత ప్రచారకుడైన ఆచార్య నాగార్జునుడు (క్రీ. శ. 137-194). రెండవ వారు, క్రీ. శ. 7వ శతాబ్దిలో జీవించి వజ్రయాన బౌద్ధశాఖలో విశేషఖ్యాతిగాంచిన సిద్ధనాగార్జునుడు. ఆచార్య నాగార్జునుని ప్రతిభా ప్రకటనయే మన ప్రస్తుతాంశం.

ఆచార్య నాగార్జునుని జన్మస్థలం విదర్భం (నేటి మధ్య ప్రదేశ్). ఈ బ్రాహ్మణుడు బాల్యముననే సన్యసించి హిందూ తత్వశాస్త్రాన్ని శోధించాడు. ఆ తర్వాత బౌద్ధ ధర్మాన్ని స్వీకరించి, ప్రారంభంలో హీనయాన శాఖకుచెంది ఆ తరువాత మహాయాన శాఖను స్వీకరించాడు. మహాయాన ధోరణి నాగార్జునునికి పూర్వీకుడైన అశ్వఘోషునితోనే ప్రారంభమైనప్పటికి, నాగార్జునుని ప్రతిభా సామర్థ్యములవల్లనే అది దేశదేశాలలో వ్యాప్తి చెందింది. కనుక నాగార్జునుడే మహాయానశాఖ మూలపురుషుడన్న ప్రతీతి ఏర్పడ్డది. అశ్వఘోషుని మహాయాన సూత్రాలను పెంచి పెద్దచేసి, ఆ మతానికి తాత్విక ప్రాతిపదిక ఐన మాధ్యమిక వాదాన్ని సృష్టించింది నాగార్జునుడు కనుక నాగార్జునాచార్యుడే మహా ...కర్త అని భావించుటలో తప్పులేదు. ఈయన పుట్టినది ...నా, జీవితంలో అధిక భాగం గడిపిందీ, మరణిం

చిందీకూడా నాగార్జున కొండలోనే. కనుక ప్రాచీనాంధ్ర మహా పురుషులలో నాగార్జునుని ఒకనిగా భావించుట నిస్సందేహంగా సరియైనదే.

మహాయాన శాఖకు తాత్విక ప్రాతిపదిక ఐనసిద్ధాంతం మాధ్యమికవాదం లేక శూన్యవాదం. ఈ తాత్విక ధోరణికి నాగార్జునుడే మూల పురుషుడు. ప్రపంచం వాస్తవమూ కాదు, మిథ్యకాదు. ఇది కార్య కారణబద్ధం. ప్రపంచం పంచేంద్రియాలచే గుర్తించబడుతున్నది. కనుక ఇది మిథ్యకాదు. ఇది వ్యావహారిక సత్యం లేక లోక సంవృతి. కాని అఖండ సత్యంవేరే ఉంది. దానికి పరిమితులు, వైరుధ్యాలు, సంబంధ బాంధవ్యాలు ఉండవు. ఆ దృష్ట్యా ప్రపంచం వాస్తవంకాదు–ఇదే మాధ్యమిక వాదం.

ప్రాచీన బౌద్ధుల భౌతికవాద దృష్టికి ఉపనిషత్తులలోని భావవాద ధోరణికి రాజీమార్గంగా ఈ మాధ్యమిక వాదం ఏర్పడ్డదని తేలికగా గ్రహించగలం. ఆంధ్ర నాగ తెగల సమ్మేళనకు, ఈ రాజీ సిద్ధాంతం అనువైన తాత్విక ప్రాతిపదిక. ఒకరి సిద్ధాంతాలను మరొకరు గౌరవించుకొనుట ద్వారా సహనము, సామరస్యము, సహజీవనము–నాటి ప్రజానీకం అలవరచుకోగలిగింది. తాత్విక దృష్ట్యా ఎంత లోపభూయిష్టమైనప్పటికీ మాధ్యమికవాదం, నాటి సంధికాలంలో ఒక చారిత్రక ప్రయోజనం నిర్వహించింది.

నాగార్జునుడు కేవలం తత్త్వవేత్త మాత్రమేకాదు; మత ప్రచారకుడు. వైద్యం, రసాయనిక శాస్త్రం, మొదలైన విజ్ఞాన శాస్త్రాలలో కూడా అఖండుడు. బహుముఖ ప్రజ్ఞా

వంతుడు. బౌద్ధమతంలో బుద్ధుని అంతటి వాడని కీర్తించబడ్డ వాడు. 24 మత గ్రంథాలను రచించాడు. ఇవి చైనా, టిబెట్, జపాను భాషలలో అనువదించబడ్డాయి. ఇందులో ముఖ్యమైనవి ఇవి. (ఈ గ్రంథాలన్నీ ప్రాకృతభాషలో ఉన్నాయి.)

1. సుహృల్లేఖ–నాగార్జునుని సమకాలికుడైన శాతవాహనరాజు గౌతమీపుత్ర యజ్ఞశ్రీ. అతని రాజధాని ధాన్యకటకం. యజ్ఞశ్రీకి రాజనీతి, బౌద్ధధర్మం, మాధ్యమికవాదం మొదలైన విషయాలన్నీ 123 శ్లోకాలలో లేఖారూపంలో నాగార్జునుడు ఇందులో వివరించాడు. నాగార్జున, యజ్ఞశ్రీల మైత్రి చరిత్ర ప్రసిద్ధం. ఆ చక్రవర్తికి ఈయన గురువు, స్నేహితుడు. నాగార్జునాచార్యుని కొరకు, ఆ రాజు నాగార్జున కొండవద్ద పారావతవిహారమను 5 అంతస్థుల భవనాన్ని కట్టించి యిచ్చాడు. నాగార్జున కొండవద్ద ఏర్పడ్డ విశ్వవిద్యాలయానికి, బౌద్ధ ఆరామాలకు ఇది నాంది.

(2) ప్రజ్ఞాప్రదీప శాస్త్రకారిక, (3) దశభూమివిభాష శాస్త్రము, (4) అనతంశక సూత్రం, (5) లంకావతార సూత్రం, (6) మాధ్యమిక సూత్రములు, (7) ప్రజ్ఞామూల శాస్త్ర టీక – ఇత్యాదులు. ఈ గ్రంథాలలో కొన్ని స్వతంత్ర రచనలు; కొన్ని ప్రాచీన రచనలకు వ్యాఖ్యానాలు. ఈ ప్రాచీన రచనలను నాగార్జునుడు సింహళంవెళ్ళి తెచ్చినట్లు బౌద్ధగ్రంథాలు తెలియజేస్తున్నాయి.

ఇంతటి ప్రతిభావంతుడైన నాగార్జునుడు, తన విజ్ఞానాన్ని వ్యాప్తి చేయుటకు నాగార్జున విశ్వవిద్యాలయాన్ని

స్థాపించాడు. జాతి, మత, కుల, దేశ, లింగవిచక్షణ లేకుండా సర్వులకు ఇందు ప్రవేశం లభించింది. నేటికీ నాగార్జునకొండ శిథిలాలలో ఈ విశ్వవిద్యాలయ భవన శిథిలాలను చూడవచ్చు. కొన్ని వేలమంది విద్యార్థులు ఇచ్చట ఉండేవారు చైనా, టిబెటు, కాశ్మీరు, సింహళ దేశాలనుండి కూడా విద్యార్థులు వచ్చినట్లు శాసన నిదర్శనాలున్నాయి.

ఆరోజులలో విశ్వవిద్యాలయ స్థాపన సామాన్య విషయంకాదు. హిందూమతంలో విద్యాబోధ అంతా గురుకులాలలో సాగేది. బ్రాహ్మణులకు మాత్రమే అది పరిమితం. విద్య అగ్రవర్ణస్థుల గుత్తసొమ్ము కాదనీ అందరికీ దానిని అందించవలెననీ భావవిప్లవం కలిగించింది బౌద్ధమతం. ఆభావానికి రూపకల్పన చేసి భారతదేశంలో ప్రథమ విశ్వవిద్యాలయం స్థాపించింది నాగార్జునుడు. నలందా మొదలైన విశ్వవిద్యాలయాలన్నీ ఆ తరువాతనే వచ్చినవి. నాగార్జునాచార్యుని ఇతర కృషి అంతా ఒకఎత్తు, భారతదేశంలో విశ్వవిద్యాలయ స్థాపనకు మూలపురుషుడుగా ఆయన చేసిన కృషి ఒక ఎత్తు.

మహాయాన మతం విగ్రహారాధనను ప్రోత్సహించింది. దాంతో శిల్పకళ వికసించింది. ప్రజానీకం యొక్క సృజనాత్మక కృషికి అంతవరకూ ఉన్న శృంఖలాలు బద్దలైనాయి. నాగార్జున కొండలోని శిల్పకళ అజంతా, ఎల్లోరా మొదలైన వాటి కన్నిటికీ నమూనాగా ఉపకరించింది. భారతీయ శిల్పకళకు ఇదే ప్రారంభం. ఈ శిల్పకళ ఇంతటితో ఆగక ఖండ ఖండాంతరాలకు వ్యాపించింది. బర్మా, ఇండోనేషియా, ఇండోచైనాలలో బౌద్ధశిల్ప కళాఖండాలు వెలిసినవి. విగ్రహా

రాధన తగునా, తగదా అన్న చర్చ అలా వుంచి వాస్తవ చరిత్రలో మహాయానమతం శిల్పకళ కిచ్చిన అఖండ ప్రోత్సాహం గుర్తించక తప్పదు.

నాగార్జునాచార్యుని కృషి ఆయన మరణంతోనే ఆగిపోలేదు. క్రీ. శ. 405 లో మనదేశం వచ్చిన చైనాయాత్రికుడు ఫాహియాను కాలంనాటికి నాగార్జునవిహారం బౌద్ధభిక్షువులతో కిటకిట లాడుతూ వుండేది. క్రీ. శ. 629 లో వచ్చిన హుయన్ త్సాంగు కాలానికి శిథిలావస్థ చెందింది.

నాగార్జునాచార్యులు ఒక సంధి కాలంలో జీవించాడు. బౌద్ధ హిందూ ధర్మాల సమన్వయానికి మార్గం సుకరం చేశాడు. ఆంధ్రజాతి పరిణామానికి దోహదమిచ్చాడు.

ఒకనాటి చారిత్రక పరిణామానికి ఏ అంశాలు ఉపకరించాయో, అవే అంశాలు ఆ తర్వాతికాలంలో నిరుపయోగము, ప్రమాదకరము, అభివృద్ధినిరోధకంగా తయారౌతాయి. ఇది చరిత్ర తెలియజేసే కఠోరసత్యం. నాగార్జునాచార్యుని రసాయనికశాస్త్ర విజ్ఞానం, నాటిశాస్త్ర విజ్ఞాన బలహీనతల ఫలితంగా రసవాదానికి, వజ్రయానానికి, తద్వారా బౌద్ధమత పతనానికి కారణమైంది. ఆయన మాధ్యమికవాదం శంకరాచార్యుని అద్వైత వాదానికి త్రోవతీసింది. ఏది ఏమైనా, ఒక సంధికాలంలో జాతి పరిణామానికి సహాయపడ్డ మహాపండితుడైన ఆచార్య నాగార్జునుడు ప్రాచీనాంధ్ర మహాపురుషులలో అగ్రగణ్యుడు.

# గోన గన్నారెడ్డి

ఆంధ్రుల చరిత్రలో కాలచక్రమొక వేయి సంవత్సరాలు తిరిగింది. కాకతీయ యుగం ఆవిర్భవించింది.

భూస్వామ్య వ్యవస్థపై ఏర్పడ్డ చిన్న చిన్న రాజ్యాలు ఆంధ్రదేశమంతటా తల ఎత్తాయి. అధికార గర్విష్ఠులైన ఈ ప్రభువులమధ్య నిరంతర కలహాలతో ఆంధ్రదేశ మొక సంగ్రామ రంగమైపోయింది. ప్రజాజీవితం సంక్షుభితమైంది. ఆర్థిక జీవితం అధ్వాన్నమైంది. వికావికలైన ఆంధ్రదేశాన్ని సమర్థమైన ఒకే కేంద్ర ప్రభుత్వ పరిపాలనక్రిందికి గుదిగుచ్చటం నాటి చారిత్రక కర్తవ్యం. కాకతీయ సామ్రాజ్యం ఈ కర్తవ్యం నిర్వహించింది.

కాని ఇది తేలిక పనికాదు. ప్రజలలో మత, కుల విభేదాలు విస్తారంగా ప్రబలిపోయినవి. సహన సామరస్యాలను బోధించిన బౌద్ధధర్మం ఏనాడో అడుగంటింది. మత విద్వేషప్రాతిపదికపై పుట్టిన వీరశైవం, జైనమతంపై కత్తి కట్టింది. కాకతీయ యుగంలో జైన మతస్థులు కొన్ని వేల మంది ఈ మత విద్వేష మహామారికి గురిఅయినారు. వెలమ, రెడ్డి, కమ్మ మున్నూరుకాపులనే పేరుతో వేర్వేరు కులాలు వ్యవసాయ వృత్తిపై ఆధారపడ్డ గ్రామీణులలో ఏర్పడ్డాయి. గ్రామజీవితంలో శాశ్వత అనైక్యతకు విషబీజాలు నాటుకున్నాయి.

కాకతీయ రాజులలో అగ్రగణ

కేవలం సైనిక శక్తితో మాత్రమే

వివిధకులస్తులమధ్య సామరస్యాన్ని స్థాపించ యత్నించాడు. తన కూతురైన రుద్రమదేవిని క్షత్రియ వంశస్థుడైన చాళుక్య వీరభద్రునికి, మరొక కూతురైన గణపాంబను ధరణి కోట పాలకుడైన కోటచేతరాజుకు యిచ్చి వివాహం జరిపాడు. కమ్మకుల ప్రారంభకుడైన జాయిపసేనాని ఇద్దరు చెల్లెళ్ళను వివాహమాడి, జాయిపను తన గజసైన్యాధిపతిగా చేశాడు. ఇట్టి వివాహాలవల్ల తాత్కాలిక ఉపశమనం మాత్రమే కలిగింది. గణపతి దేవుడు తన అనంతరం తన కూతురైన రుద్రమదేవిని మహారాణిగా సింహాసనం ఎక్కించి మరణించాడు.

అంతవరకు నివురుగప్పిన నిప్పువలె ఉన్న అంతఃకలహాలన్నీ ఒక్కసారి ప్రజ్వరిల్లాయి. కుల ద్వేషాలకు మరొక అంశం తోడైంది. "ఇంతమంది మగమహారాజులు, ప్రభువులు, ఒక ఆడుదాని పరిపాలనకు తలఒగ్గి ఉండటమా?" భారత దేశంలో ఒక స్త్రీ గొప్ప సామ్రాజ్యాన్ని పాలించిన ఉదంతం, రుద్రమదేవికి పూర్వం గాని తర్వాతగాని లేదు. పురుషాధిక్యతపై ఆధారపడ్డ సమాజంలో, భూస్వామ్య వ్యవస్థలో ఒక స్త్రీ 30 ఏండ్లకు పైగా విశాల సామ్రాజ్యాన్ని, గంజాం నుండి కంచివరకు, తూర్పున సముద్రంనుండి పశ్చిమాన బళ్ళారివరకు పరిపాలించుట సామాన్య విషయం కాదు. కాని సరిగ్గా అదే జరిగింది. ఇది ఎలా సాధ్యమైంది ?

రుద్ర[illegible] పరిపాలన (1262–1296) ఆరంభమైన [illegible]కలహాలు తల ఎత్తినవి. స్త్రీ అధికా[illegible] [illegible]తకక్షలు, కులద్వేషాలు మన

సులో ఉన్నవారు, రుద్రమ పరిపాలనను గుర్తించ నిరాకరించారు. ఓరుగల్లు నుండి వచ్చే ఆజ్ఞలను తిరస్కరించడం, కప్పం కట్టటం మానివేయడం, రుద్రమదేవిని తొలగించి మరొకరిని చక్రవర్తిని చేయటానికి కుట్రలు పన్నటం ప్రారంభమైంది. స్థానిక ప్రభువులు ఎవరికివారు సైన్యాలను విపరీతంగా పెంచుకోసాగారు. ఆదవోని అధిపతి కోటారెడ్డి, కందవోలు (కర్నూలు) ప్రభువు పాకనాటికి చెందిన కోట పేర్మాడిరాయుడు (ఒంగోలు, నెల్లూరు ప్రాంతం) మేడిపల్లి (గోదావరీ తీరం) కాచమ నాయకుడు-మొదలైన వారనేకులు బహిరంగంగానే తిరుగుబాటు ధ్వజమెత్తారు. సమయం వస్తే చేరదామని మరికొందరు కనిపెట్టుకున్నారు. ఈ అంతఃకలహాలను ప్రోత్సహించి మొత్తం ఆంధ్ర సామ్రాజ్యాన్నే అంతరింపజేయాలని, కంచికి చెందిన చోడరాజులు ఉత్తరదిశలోని కాళింగులు, పశ్చిమ దిశలోని భల్లాళ, యాదవరాజులు కనిపెట్టుకుని ఉన్నారు. అంతఃశత్రువులతోను, బహిఃశత్రువులతోను కాకతీయరాజ్యం ఊగిసలాడసాగింది.

ఇట్టి విషమావస్థలో కొందరు విశ్వాస పాత్రులైన సేనానులు మాత్రం రుద్రమదేవికి అండగా ఉన్నారు. సర్వసేనాని ప్రసాదిత్యనాయుడు, మల్యాల గుండయ్య, రేచర్ల ...సేనాని, ఇందులూరి అన్నయమంత్రి, గోనగన్నారెడ్డి ...ఖ్యులు.

...లోను గోన గన్నారెడ్డి కొక ప్రత్యేకత ఉంది.
...యణం వ్రాసిన గోన బుద్ధారెడ్డి కొడుకు
...ల్లో భువనగిరి, ఆ తర్వా ... క్షమాని

(నల్గొండజిల్లా) రాజధానులుగా వీరు పరిపాలించారు. గన్నా రెడ్డి బాలుడుగా ఉన్నందున బుద్ధారెడ్డి మరణానంతరం, అతని తమ్ముడు లకుమయారెడ్డి రాజ్యపాలన చేయసాగాడు. అంత టితో ఆగక, అన్నగారి సంతానాన్ని మోసంచేసి, శాశ్వ తంగా రాజ్యాన్ని పొందవలెననే దుర్బుద్ధికూడ అతనికి కలి గింది. దాంతో లకుమయారెడ్డి రుద్రమదేవిని తొలగించవల ననే యత్నంలో కుట్రదారులకు సహాయం చేయసాగాడు.

కాకతీయరాజ్యం 200 ఏండ్లుగా సుస్థిర పరిపాలన చేస్తూ వచ్చింది. తత్ఫలితంగా ప్రజలు సుఖశాంతులు అనుభ విస్తున్నారు. కాకతీయ సామ్రాజ్యం ఆనాడు విచ్ఛిన్నం కావటం అంటే, ఆంధ్రదేశమంతా ఏ దేవగిరి యాదవులకో లేక అప్పుడే ఉత్తరహిందూస్థానంలో సాగుతున్న మహమ్మ దీయ దండయాత్రలకో గురికావటం తప్పవేరుగాదు. కనుక నాటి పరిస్థితులలో సామ్రాజ్య రక్షణకు పూనుకున్న సేనా నులు చిరస్మరణీయులు. "ఆడదాని పెత్తనం సహించటమా?" అన్న సంకుచిత మనస్తత్వాన్ని ప్రదర్శించక, మొత్తం దేశ ప్రయోజనాలకు వీరు ప్రాధాన్యం ఇచ్చి విశాల దృష్టితో ప్రవర్తించారు.

గన్నారెడ్డి సైనిక వ్యూహ నిర్మాణంలో అనేక క్రొత్త పద్ధతులను ప్రవేశ పెట్టాడు. కొండలలో అడవులలో శత్రువుపై మెరపుదాడి చేయటం, శత్రువు బలం... ప్పుడు వెనుకకు తగ్గి ఏమరుపాటుగా ఉన్నప్పుడు ముఖాముఖి యుద్ధానికి బదులు శత్రువును పద్ధతులను అవలంబించటం-ఆధునిక యుద్

గెరిల్లా పద్ధతులనబడే వాటిని-గన్నారెడ్డి ప్రవేశపెట్టాడు. ఈ క్రొత్త పద్ధతులద్వారా, ఆంతరంగిక కుట్రలను ఎక్కడికక్కడ త్రుంచి వేయ గలిగాడు. దేవగిరి మహాదేవరాజు, 5 లక్షల సైన్యంతో దండెత్తి ఓరుగల్లుపై ముట్టడికి వస్తూన్నప్పుడు త్రోవలో మంజీర నదిఒడ్డున, కొండలోయలగుండా సైన్యం నడుస్తున్నప్పుడు, ఆ సైన్యాన్ని అడ్డగించి చీకాకు పరచి, ఆహారధాన్యాలు రాకుండా చేసి, ఇంకా అనేకమైన ఇబ్బందులకు గురిచేసి, ఓరుగల్లు చేరునప్పటికి 2 లక్షల సైన్యాన్ని హతమార్చాడు. చరిత్రప్రసిద్ధమైన ఈ ఓరుగల్లు యుద్ధంలో రుద్రమదేవి పురుషవేషం ధరించి స్వయంగా సేనలకు నాయకత్వం వహించింది. దేవగిరిరాజు ఓడిపోయి పలాయనం చిత్తగించాడు. రాజ్యం శత్రునిశ్శేషమైంది.

గన్నారెడ్డివంటి దేశాభిమాన ప్రేరితులైన, సాహసికులైన సేనానుల కృషి ఫలితంగా ఆంధ్రరాజ్యం మరొక 50 సంవత్సరాలు కొనసాగింది. సంకుచిత భావాలకు లొంగక రాజ్యక్షేమానికి తమ జీవితాలు అర్పణచేసిన గన్నారెడ్డివంటి సేనానులు ఆదర్శప్రాయులు.

## ముసునూరి నాయకులు

కాకతీయరాజ్యం, క్రీ. శ. 1323 లో అస్తమించింది. ఢిల్లీసుల్తాన్ అయిన గియాసుద్దీన్ తుగ్లక్ సైన్యాలు, అతని కుమారుడు ఉలూఖాన్ నాయకత్వాన ఓరుగల్లును వశపరచుకొని, ప్రతాపరుద్రుని ఖైదుచేసాయి. 300 సంవత్సరాలు ఏకచ్ఛత్రంగా ఆంధ్రదేశాన్ని పరిపాలించిన కాకతీయ ప్రభుత్వం పతనమైంది.

దోపిడీదారులైన మహమ్మదీయ సైనికులు దేశాన్ని కొల్లగొట్టసాగారు. నాటి ప్రజల కడగండ్లను ప్రోలయ నాయకుని విలాస శాసనం ఇలా వర్ణించింది: (విలాస, తూర్పుగోదావరి జిల్లా, కోనసీమలోని గ్రామం).

"ధనవంతులను మహమ్మదీయ సైనికులు శతవిధములుగా చిత్రహింసల పాల్జేసి డబ్బు కొల్లగొట్టుతున్నారు. పారసికులను (ముస్లిములను) చూసినవెంటనే కొందరు భయభ్రాంతులై ప్రాణాలు వదులుతున్నారు. బ్రాహ్మణులు నిత్యమత కర్మలు చేసుకో వీలు లేదు. దేవాలయాలు, విగ్రహాలు ధ్వంసం చేయబడుతున్నాయి. పండితుల ఆధీనంలో వున్న అగ్రహారాలన్నీ స్వాధీనం చేసుకున్నారు. బీదలు, భాగ్యవంతులు అందరూ ఒకేవిధంగా నలిగిపోతున్నారు. భార్యలను ఎత్తుకుపోతున్నారు. ఈ పరిస్థితులలో తెలుగు ప్రజలు ఎలా జీవించగలరు ? తెలుగు దేశం అంతా దావానలంతో దగ్ధమౌతున్న మహారణ్యంవలె ఉంది."

ఇదే విషయాన్ని బార్నీ అను ముస్లిం చరిత్రకారుడు ఇలా వర్ణించాడు : "రైతులవద్ద నుండి అధికంగా పన్నులు వసూలు చేయటానికి సుల్తాను పూనుకున్నాడు. అంతకు పూర్వం కంటె 5 రెట్లు, పదిరెట్లు పన్నులను పెంచాడు. ఈ పన్నుల భారంతో అనేక రైతు కుటుంబాలు నాశనమైనవి. బీదరైతులు దరిద్రులై బిచ్చగాళ్ళయిపోయినారు. ధనికులు కోపంతో గ్రామాలను వదలి వెళ్ళి తిరుగుబాటు సేనలో చేరారు. భూములు బీడుపడ్డాయి. వ్యవసాయం పూర్తిగా నన్నగి

ఇదీ నాటిస్థితి. ఈ దుస్థితిని తొలగించి తిరిగి స్వతంత్రరాజ్యం స్థాపించటానికి కొందరు వీరులు ముందు కురికారు. వారిలో ప్రోలయనాయక, కాపయనాయకులు ముఖ్యులు.

వీరిరువురు అన్నదమ్ముల బిడ్డలు. నూజివీడు దగ్గర ముసునూరు వీరి జన్మస్థలము. కమ్మకులస్థులని ఊహించుట కెక్కువ ఆధారాలున్నవి.

మన చరిత్రలో మతావేశంతో, రాజభక్తితో సాహస కృత్యాలు చేసిన వీరులు పలువురున్నారు. మహారాజ్యాధిపతులకు కొదువలేదు. కాని ప్రజల కడగండ్లు చూసి హృదయం ద్రవించి, పరరాజ్య నిర్మూలనకు కంకణం కట్టి, కనీసం అధికారం చేజిక్కించుకునే వరకైనా ప్రజాహృదయాన్ని ప్రతిబింబించిన నాయకులు ఉన్నారా, అని ప్రశ్నించుకుంటే ఈ ముసునూరి నాయకులే దృగ్గోచర మవుతారు.

వీరు కాకతీయ రాజులకడ పెద్ద సేనాపతులుగా పేరు గడించలేదు. బహుశా కొన్ని గ్రామాలను పరిపాలించే స్థానిక పరిపాలకులై ఉండవచ్చు. ముస్లిం దోపిడీదారులను పారద్రోలి ఆంధ్రదేశాన్ని విముక్తిచేసి తిరిగి ఓరుగల్లు రాజ్యస్థాపన చేయుటకు వీరు పూనుకున్నారు.

ప్రతాపరుద్రుని సేనాధిపతులలో, నశించగా మిగిలిన కొందరు వీరికి తోడైనారు. ఇందులూరి అన్నయ మంత్రి, కొలని రుద్రదేవుడు, రేచెర్ల సింగమనాయకుడు అట్టివారు. ఈ ముగ్గురు పాతసేనానులు మాత్రమేకాక, అద్దంకి పాలకుడయిన వేమారెడ్డి, కొప్పుల కుటుంబానికి చెందిన పోలనాయ

కుడు, మంచికొండ గణపతినాయకుడు వీరందరూ ఏకమైనారు. ఈ వీరులందరూ ఏకమై ముసునూరి ప్రాంతీయ నాయకుని ఆధ్వర్యాన తిరుగుబాటుకు సన్నాహాలు చేయసాగారు.

భద్రాచలం కొండలలోని రేకపల్లి ప్రాంతీయ నాయకుని కేంద్రం. కోయప్రజల సాయంతో, భద్రాచలం అడవులలో స్థావర మేర్పరచుకొని, ప్రోలయ నాయకుడు కోస్తా ఆంధ్రదేశంలోని మహమ్మదీయ దుర్గాలపై వీలును బట్టి దాడి చేసేవాడు. గన్నారెడ్డి ప్రారంభించిన గెరిల్లా యుద్ధపద్ధతిని ప్రాంతీయనాయకుడు మరింత అభివృద్ధి చేశాడు. ఈ విముక్తి సైన్యాలు ఇలా సైనిక చర్యలు జరుపుతుండగా, వీరి విజృంభణకు అనుకూల సమయం వచ్చింది. క్రీ. శ. 1325 లో ఢిల్లీ సుల్తాన్ గియాసుద్దీన్ తుగ్లక్ చనిపోయాడు. వెంటనే అతని కుమారుడు ఉలూఖాన్ వరంగలును ఒక సేనాధిపతికి అప్పజెప్పి, ఢిల్లీసింహాసనం ఆక్రమించుకునేందుకు వెళ్ళాడు. ఈ అదునులో ప్రాంతీయ నాయకుడు కోస్తా ప్రాంతాన్నంతటిని ఆక్రమించుకొని మహమ్మదీయులను తరిమివేశాడు. ప్రాంతీయనాయకుని పరిపాలనను విలాసశాసనం ఇలావర్ణించింది:

"తురుష్కుల ఆక్రమణచే అపవిత్రమైన ఆంధ్రప్రాంతాలను ప్రోలయనాయకుడు తిరిగి పవిత్రంచేశాడు మునీశ్వరులు తమ తపస్సులో ఆరవవంతు భాగాన్ని ప్రాచీనకాలంలో రాజులకు సంతోషంతో ఇచ్చినట్లు, రైతులు మనస్ఫూర్తిగా సంతోషంతో పన్నులు చెల్లించేవారు. •తురుష్కులు చేసిన అన్యాయాలన్నీ తొలగించబడి యథాపూర్వస్థితి ఏర్పడ్డది. 15

సంవత్సరాలు పాలించి ప్రోలయ నాయకుడు 1340 లో మరణించాడు.

తెలంగాణాను విముక్తి చేసే బాధ్యతను అతని తమ్ముడైన కాపయ నాయకుడు స్వీకరించాడు. ఆంధ్ర దేశమంతటా ఆనాడు మహమ్మదీయ వ్యతిరేక తిరుగుబాట్లు జరుగుతూ వచ్చాయి. కడపజిల్లా గండికోటను పరిపాలిస్తున్న సోమదేవరాజు, గుంటూరు జిల్లా అద్దంకి పాలకుడైన కోమటి వేమారెడ్డి సాయంతో రాయలసీమ జిల్లా లన్నిటినీ విముక్తి చేశాడు. కందనవోలు (కర్నూలు) గంగినేని కొండ, మొసలిమడుగు, సాతాని కోట (ఇవన్నీ కర్నూలు బళ్ళారి జిల్లాలలోనివి) దుర్గాలనుండి మహమ్మదీయులను పారద్రోలాడు. ఇదే కాలంలో క్రీ. శ. 1336 లో హరిహరబుక్కరాయలు హంపీ విజయనగరంలో కొత్తరాజ్యాన్ని స్థాపించారు.

మహమ్మదీయరాజులు అన్నివైపులా చిక్కుల్లో ఉన్న యీఅదును కనిపెట్టి కాపయ నాయకుడు తెలంగాణా విముక్తి కార్యక్రమం చేపట్టాడు. క్రీ. శ. 1336 లో ఓరుగల్లును స్వాధీనం చేసుకున్నాడు. తెలంగాణా తిరిగి స్వతంత్రమైంది. మహమ్మదీయుల పరిపాలన క్రింద తెలంగాణా ప్రజలు, తదితర ఆంధ్ర ప్రజలు పడ్డ అవస్థలను బెర్నీ అను చరిత్రకారుడు ఇలా వర్ణిస్తున్నాడు:

"శిస్తులు చెల్లించలేక రైతులు బిచ్చమెత్తుకోసాగారు. ......వర్షాలు కురవనందువల్ల కరువుకాటకాలు ఏర్పడ్డాయి. వేలాది ప్రజలు మరణించారు. కొన్ని కుటుంబాలు సమూ

లంగా నశించాయి. నాటినుండి సుల్తాన్ మహమ్మదీయ ప్రభుత్వానికి పతనావస్థ ప్రారంభమైంది."

ఇట్టి దీనావస్థలోవున్న తెలంగాణా కాపయ నాయకుని పరిపాలనలో తిరిగి సుఖసంపదలతో వర్ధిల్లసాగింది. 1336—67 వరకు 30 సంవత్సరాలకాలం కాపయ నాయకుడు ఓరుగల్లు రాజధానిగా పరిపాలించాడు.

కాని, ఈ 30 ఏండ్ల పరిపాలనలో కాపయ నాయకుడు నిరంతరం యుద్ధాలలో నిమగ్నుడై ఉండవలసివచ్చింది. గుల్బర్గాను పాలిస్తున్న హసన్‌గంగూ ఢిల్లీ సుల్తానును ధిక్కరించి 1347 లో బహమినీ రాజ్యాన్ని స్థాపించాడు. ఈ రాజ్యస్థాపనను కాపయ నాయకుడు బలపరిచాడు. కాని హసన్ గంగూ ఓరుగల్లుపై దండెత్తడం మానలేదు. ఏవేవో సాకులతో హసన్‌గంగూ 1350 లో ఒకసారి, 1356 లో ఒకసారి రెండుసార్లు ఓరుగల్లుపై దండెత్తాడు. రేచర్ల పరిపాలకులైన పద్మ వెలమనాయకులు కాపయ నాయకుని అధికారం అంగీకరించలేదు. కనుక ఈ యుద్ధాలలో వారు తటస్థులుగా ఉన్నారు.

ఒంటరిగాడైన కాపయ నాయకుడు రెండు యుద్ధాలలోను మహమ్మదీయుల చేతులతో ఓడిపోయి రాజీ చేసుకోవలసి వచ్చింది. కాని ఓరుగల్లు ఆధిపత్యం మాత్రం పోలేదు.

రేచర్ల, ఓరుగల్లు రాజుల అంతఃకలహాలే కాపయ నాయకుని పతనానికి కారణమైనాయి. 1367 లో వరంగల్

జిల్లాలోని భీమవరంవద్ద కాపయనాయకునికి రేచర్ల సింగమ నాయకునికి జరిగిన యుద్ధంలో కాపయ నాయకుడు మరణించాడు. ఓరుగల్లులోని ఆఖరు ఆంధ్రరాజ్యం అంతరించింది.

మహమ్మదీయులను పారదోలి ఓరుగల్లులో స్వతంత్ర రాజ్యాన్ని స్థాపించాలని మునునూరి నాయకులు చేసిన ప్రయత్నం విఫలమైంది. తిరుగుబాటు దారులంతా ఐకమత్యంగా ఉన్నంత వరకూ అది జయప్రదమైంది. వారిలో అంతఃకలహాలు ఏనాడు ప్రజ్వరిల్లాయో ఆనాడే తిరుగుబాటు పతనం ప్రారంభమైంది. మునునూరి నాయకుల పతనానంతరం రేచర్ల పద్మనెలమ నాయకులు చాలాకాలం నల్లగొండజిల్లాను పరిపాలించారు, కాని స్వతంత్ర రాజుల హోదాలో మాత్రం గాదు, బహమనీ రాజ్య సామంతులుగా మాత్రమే వారు మనగలిగారు. నాటినుండి తెలంగాణాలో మహమ్మదీయ పరిపాలన స్థిరపడ్డది.

ముంచుకు వస్తున్న మహమ్మదీయ దండయాత్రను కాపయ నాయకుడు 30 ఏండ్ల పాటు ఆపగలిగాడు. ఒక సామాన్య స్థానిక పాలకుడు ప్రజాసహకారంతో సాహసం చేసి, బలీయులైన శత్రువులను ప్రతిఘటించి స్వతంత్ర రాజ్యాన్ని స్థాపించుట అపూర్వ విషయం. ఆంధ్రవీరులలో ప్రోలయ, కాపయ నాయకులకు శాశ్వత స్థానమున్నది.

(1—10—55)

# ఆంధ్ర చరిత్రపై బౌద్ధ సంస్కృతీ ప్రభావం

ఆంధ్రలో బౌద్ధ మతం అతి ప్రాచీనకాలంలోనే అడుగు పెట్టింది. బౌద్ధ జాతకకథలలో ఆంధ్రదేశాన్ని గురించి, ఆంధ్రు లను గురించి అనేక ప్రస్తావనలున్నాయి. కృష్ణా గోదావరి ప్రాంతాన్ని జాతకకథలు వజ్రదేశం, నాగభూమి, మంజీర దేశం అని వేర్వేరు పేర్లతో వర్ణించాయి. కళింగదేశపు రాకుమార్తె ఆమె భర్తతో కలిసి బుద్ధుని దంతముగల పెట్టెను తీసుకొని సింహళదేశం వెళ్లుతూండగా త్రోవలో వారి ఓడ వజ్రాలదిన్నె వద్ద ఒడ్డుకు చేరుకున్నదని, అచ్చట నాగాశోకు డను రాజు ఒక బౌద్ధస్తూపాన్ని నిర్మిస్తున్నాడని ఒకగాథ వివ రిస్తున్నది. వజ్రాలదిన్నె ధరణికోట. నాగాశోకుడు నిర్మి స్తున్న స్తూపం అమరావతీ స్తూపం.

నాగాశోకునివద్ద గల బుద్ధుని అస్తికలను, సింహళ రాజైన మేఘవర్ణుడు తీసుకువెళ్ళి, సింహళంలో మరొకస్తూపం నిర్మించినట్లు ఇంకొక జాతకకథ తెలియజేస్తున్నది.

కళింగదేశానికి చెందిన విజయుడను రాజు, 700 మంది పరివారంతో, బౌద్ధభిక్షువులతో బుద్ధుని అవశేషాలను వెంట తీసుకొని సింహళదేశం వెళ్ళి స్థిరపడినట్లు వెస్సంతర జాతకం తెలియజేస్తున్నది. సింహళదేశ చరిత్ర, విజయునితో ప్రారంభ మైనట్లు ఆదేశ చరిత్ర ధృవపరుస్తున్నది.

గౌతమబుద్ధుని జీవితకా[illegible] అనగా క్రీ.పూ. 6 వ శతాబ్దిలోనే, బౌద్ధమతం

ధ్వంసం చేయటం, మొదలైన రూపాలలో బానిసల అసం తృప్తి వ్యక్తమౌతూండేది. బానిసల ఈ తిరుగుబాట్ల ఫలితంగా బానిస విధానం పతనావస్థకు వచ్చింది. బానిసలకు సైతం ఉత్పత్తిలో కొంతభాగం ఇచ్చి, సమాజంలో ఒక హోదా గౌరవం ఇస్తే తప్ప సామాజిక ఉత్పత్తి ముందుకు పోని పరిస్థితి ఏర్పడ్డది. బానిస తెగల అన్యోన్య కలహాలు ఆ సమాజ విచ్ఛిత్తికి మరొక కారణంగా ఉపకరించాయి.

ఈ కలహాల ఫలితంగానే ఆంధ్రులు యమునా నదీతీరం నుండి దక్షిణాదికి తరలి, వింధ్యపర్వతాలను అధిగమించారు. కొత్త దేశంలో, కొత్త ప్రజలతో, కలిసి మెలిసి జీవించక విధిలేని పరిస్థితిలో వారు అతి త్వరగా అర్ధ బానిస విధానానికి అలవాటుపడ్డారు. నాగ, యక్ష, తెలుగు ప్రజలతో కలిసి పోయారు.

ఏ మతస్థుడైనా, ఏ కులస్థుడైనా గ్రామంలో నివసించి తన వృత్తి తాను చేసుకోటానికి హక్కున్నదని, అతని ప్రాణ మాన రక్షణకు గ్రామస్థులందరూ బాధ్యత వహించాలని స్వయంసంపూర్ణ గ్రామవ్యవస్థ నిర్దేసిస్తున్నది. భారతదేశంలో అర్థబానిస విధానం స్వయం సంపూర్ణ గ్రామవ్యవస్థ రూపంలో ప్రారంభమైంది. గ్రామములో ఇట్టి సహజీవన వాతావరణం ఏర్పడేందుకు బౌద్ధ సంస్కృతి ఎంతో సహాయపడ్డది.

బౌద్ధ మతాన్నవలంబించిన రాజులు ప్రజలపట్ల, పరిపాలనా విధానంలోను ఉదార స్వభావాన్ని ప్రదర్శించారు. తత్ఫలితంగా వారు ప్రజారంజకులైనారు. ప్రజల అండదండల

నాధారం చేసుకొని ఈ రాజులు శత్రు రాజులను జయించి గొప్ప సామ్రాజ్యాలను నిర్మించగలిగారు. అశోక, శాతవాహన సామ్రాజ్యాలే ఇందుకు నిదర్శనాలు. బుద్ధుని పూర్వం రాజులు దురభిమాన పూరితులై అంతఃకలహాలలో నిమగ్నులైన ఫలితంగా, భారత దేశంలో బలమైన ఏ ఒక్క రాజ్యం ఏర్పడలేక పోయింది. గౌతమ బుద్ధుని సమరస ధోరణి, అహింస, రాజుల మధ్య జరిగే అంతః కలహాలను అరికట్టి, దేశ ఐక్యతకు తోడ్పడ్డది. ఈ విధంగా పీడిత ప్రజలకు, ఉదార భావాలు గల పాలక వర్గాలుకు సైతం బుద్ధుని బోధలు ఉపకరించాయి. దేశ సమైక్యతకు సహాయపడ్డాయి.

## శిల్పకళ

బౌద్ధ యుగంలో ఆంధ్ర సంస్కృతి అన్ని రంగాలలోను నవనవోన్మేషంగా వికసించింది. అన్నిటికంటె ఎక్కువగా ఈ నూత్న జీవనం శిల్పకళాసృష్టిలో వ్యక్తమయింది.

బౌద్ధమతానికి పూర్వం భారత దేశంలో మానసిక శ్రమకు అత్యధిక గౌరవం, శారీరక శ్రమపట్ల న్యూనతా భావం ఉండేది. ఈ వ్యత్యాసాన్ని బుద్ధుడు ఖండించాడు. తాత్విక చర్చలలో మునిగి తేలే పండితునితో సమానమైన గౌరవాన్ని మట్టిపిసికి, గోడలు, ఇళ్ళు కట్టి, పొట్టపోసుకునే శ్రమజీవికి కూడా ఇచ్చాడు. బౌద్ధ భిక్షువులందరూ వ్యవసాయం, వడ్రంగము, శిల్ప, చిత్రకళలలో ఏదో ఒకదానిని విధిగా నేర్చుకోవాలని బుద్ధుడు ఆదేశించాడు. కనుకనే బౌద్ధ ఆరామాలు, తాత్వికచర్చా ఘోషలతో మాత్రమే గాక

ఉలుల శబ్దాలతో కూడ ప్రతిధ్వనించాయి. వృత్తిపనివారు, వేలసంఖ్యలో బౌద్ధమతాన్ని ఆశ్రయించారు.

## అ మ రా వ తి

ఆంధ్ర శిల్పకళ అత్యున్నతస్థాయిని అందుకున్న ప్రాంతాలు అమరావతి, నాగార్జునకొండ ప్రాంతాలు.

అమరావతిలోని బౌద్ధస్తూపాన్ని నాగాశోకుడను నాగరాజు ప్రారంభించాడు. దానిని మౌర్య అశోకుడు, ఆ పిమ్మట శాతవాహన చక్రవర్తి యజ్ఞశ్రీ అభివృద్ధిపరచారు. యజ్ఞశ్రీ కాలంలో క్రీ. శ. (174-200) అమరావతి స్తూపానికి నాగార్జునాచార్యుని ప్రత్యక్ష పర్యవేక్షణక్రింద ఒక ప్రాకారం నిర్మించబడ్డది. ఈ స్తూపం ఉన్నచోట అమరావతిలో ప్రస్తుతం ఒక దిబ్బమాత్రం ఉంది. స్తూప అవశేషాలు కొన్ని మద్రాసు మ్యూజియంలోనూ, మరికొన్ని లండన్ మ్యూజియంలోనూ ఉన్నాయి.

అమరావతి స్తూప ఫలకాలమీద, బౌద్ధ జాతకకథలన్నీ అతిమనోహరముగా చిత్రీకరించబడినవి.

అమరావతి శిల్పములను నాలుగు తరగతులుగా విభజించవచ్చును. క్రీ. పూ. 200 కు పూర్వం చెక్కబడినవి. క్రీ. పూ. 100 నాటివి. క్రీ. శ. 150 నాటివి. క్రీ. శ. 200-500 మధ్యవి. ఈ నాలుగు దశల శిల్పములలోను, మూడవ దశలోని శిల్పములు అత్యుత్తమమైనవి. ఆచార్య నాగార్జునుని పర్యవేక్షణక్రింద ఈ శిల్పసృష్టి జరిగింది.

బౌద్ధస్తూప నిర్మాణం ఈ క్రింది విధంగా ఉంటుంది. 2, 3 గజముల ఎత్తు, 500 అడుగులు చుట్టుకొలత గల ఒక మట్టిదిబ్బ ఉంటుంది. ఈ మట్టిదిబ్బ మధ్యలో బుద్ధుని శరీర ధాతువు బంగారు బరిణెలో నిక్షేపించబడి ఉంటుంది. ఈ మట్టి దిబ్బచుట్టూ ఇటుక కట్టడం ఉంటుంది. వేదిక పై భాగమున ఒక బోర్లించబడిన గిన్నెవలె నుండు అండము, ఆపైన స్తంభ ము, దానిపైన ఛత్రము ఉంటాయి. ఇది ధర్మ ఛత్రము.

ఈ వేదికచుట్టు విశాలమైన ప్రాకారం. ప్రాకారానికి, వేదికకు మధ్య ప్రదక్షిణపథం.

ఈ ప్రాకారమునకు నాలుగు వైపుల ద్వారములు, తోరణ స్తంభములు ఉంటాయి. ఈ ద్వారాలు, తోరణ స్తంభాలు, శిల్పుల కళకు ప్రధాన ఆలంబనాలు.

లోపల వేదికకు నాలుగు వైపుల ఒక్కొక్క చోట అయిదేసి చొప్పున 20 స్తంభా లుంటాయి. వీనిని ఆయక స్తంభా లంటారు.

పై నిర్మాణంలో, వీటైన ప్రతి అంగుళం ప్రాంతంలోను ఆంధ్ర శిల్పులు తమ శిల్పకళను ప్రదర్శించారు,

అమరావతి శిల్పములలో, బౌద్ధ జాతకకథలు మాత్ర మేకాక నాటి సామాజిక జీవనాన్ని ప్రతిబింబించే సకల వస్తు సంచయమూ ఉంది. పూరిగుడిసెలు, మహాప్రాసాదములు, నగలు, బండ్లు, ఆయుధాలు, వేర్వేరు భంగిమలలో స్త్రీ పురు షులు, వారి వస్త్రధారణ పద్ధతులు – మొదలైనవన్నీ ఈ శిల్పాల ద్వారా మనం గ్రహించగలము.

అమరావతీ శిల్పకళలో ఒక విశిష్టత ఉంది. స్వల్ప విస్తృతిలో జీవకళ ఉట్టిపడేవిధంగా ఆంధ్రశిల్పి పైచిత్రాలన్నిటినీ చెక్కగలిగాడు. అమరావతీ శిల్పంలో లాలిత్యం, మృదుత్వం, నైపుణ్యాం ఉన్నతస్థాయి నందుకున్నాయి. బౌద్ధ యుగంలో ఆంధ్రలో ప్రారంభమైన ఈ శిల్ప సాంప్రదాయం, అజంతా ఎల్లోరాలకు వ్యాపించి, సాంచీవరకు పయనించింది.

అదే కాలంలో మరొక శిల్ప సాంప్రదాయం, గ్రీసు దేశంనుండి మన దేశంలో అడుగుపెట్టింది. ఇది ఎక్కువగా పశ్చిమోత్తర రాష్ట్రంలోను, ఉత్తర హిందూస్థానంలోను వ్యాపించింది. దీని పేరు గాంధార శిల్పం. ఇందులో లాలిత్యం, మృదుత్వం తక్కువ విస్తృతి, గాంభీర్యం హెచ్చు. అమరావతీ శిల్పకళద్వారా ఆంధ్ర శిల్పి భారతీయ కళా ప్రపంచంలో విశిష్టస్థానాన్ని సంపాదించుకున్నాడు.

## నా గా ర్జు న కొం డ

అమరావతితో సమానమైన ప్రాధాన్యతగల మరొక బౌద్ధకేంద్రం నాగార్జునకొండ. ఇది కృష్ణా నదీతీరంలో అమరావతికి ఎగువగా 80 మైళ్ళలో ఉంది. ప్రస్తుతం ఇచ్చట జరుగుతున్న త్రవ్వకాల ఫలితంగా, బౌద్ధ ఆరామాలు, స్తూపాలు మాత్రమే గాక, విజయపురి నగర శిధిలాలు కూడా బహిర్గత మాతున్నాయి.

నాగార్జునాచార్యుని ( క్రీ. శ. 150–200 ) నివాసస్థలమైనందువలన, నాగార్జున కొండ, భారతదేశంలో మాత్రమే కాక ప్రాచ్యఖండమంతటా పేరుప్రతిష్ఠలు సంపాదించుకున్నది.

ఇప్పటివరకు ఈ ప్రాంతంలో ఈ క్రింది విశేషాలు బయటపడ్డాయి. ఒక పెద్ద విశ్వవిద్యాలయం, విద్యార్థుల వసతి గృహం, పట్టప్రదానోత్సవాల కుపయోగపడే పెద్ద హాలు బయటపడ్డాయి. ఈ హాలులో 3 వేల మంది విద్యార్థులు కూర్చోవచ్చు. ఈ విశ్వవిద్యాలయానికి భారతదేశంలోని అన్ని రాష్ట్రాలనుండి మాత్రమేగాక, చీనా, జపాను, సింహళ దేశాలనుండికూడా విద్యార్థులు వచ్చేవారని, ఇక్ష్వాకురాజుల శాసనాలే తెలియజేస్తున్నాయి. ఈ విశ్వవిద్యాలయ భవనంలో కొన్ని వందలమంది విద్యార్థులు నివసించే గదులు, హాలులు ఉన్నాయి. వసతి గృహంలో నీటిగొట్టాలు, సెప్టిక్ పాయిఖానాదొడ్లు ఉన్నాయి. ఆనాడు ఈ నాగార్జున విశ్వవిద్యాలయం ఎంతటి ఔన్నత్యంలో ఉండేదో పై వివరాలే స్పష్టంచేయగలవు.

ఇదికాక, స్తూపాలు, చైత్యాలు, విహారాలు మొత్తం 20 కి పైగా బయటపడ్డాయి. స్తూపం బౌద్ధుల ఆరాధన భవనం. చైత్యం బౌద్ధ భిక్షువుల అధ్యయన భవనం. విహారం భిక్షువుల నివాస భవనం. ఈ స్తూపాలలో ఒక మహాస్తూపం కూడా ఉంది. బుద్ధుని శరీరధాతువు కలదాన్ని మహాస్తూపం అంటారు.

అమరావతిలో వలెనే ఇచ్చటకూడ బుద్ధుని అస్థికల మీద ఈ మహాస్తూపం నిర్మించబడింది. ఈ మహాస్తూపంలోని బుద్ధధాతువు ప్రస్తుతం సారనాథ్‌లోని మూలగంధకుటీ విహారానికి చేరవేయబడ్డది.

ఇదిగాక ఒక స్టేడియం ఈమధ్యనే బయటపడ్డది. వేల కొలది ప్రేక్షకులు చుట్టూ గాలరీమీద కూర్చుని ఉంటే మధ్య లోతైన వేదిక నుండి ఉపన్యాసకుడు ఉపన్యాసం చేస్తాడు. ఇట్టి స్టేడియంలు ఇంతవరకు భారత దేశంలోని ఏ బౌద్ధ కేంద్రాలలోను బహిర్గతం కాలేదు. గ్రీస్ ఇటలీ దేశాలతో శాలివాహన యుగంలో ఆంధ్రకు విస్తారంగా వర్తక వాణిజ్యాలు జరిగేవి. రోమన్ దేశస్థులనుండి బహుశా ఈ స్టేడియం నిర్మాణభావం ఆంధ్ర శిల్పులకు స్ఫురించి ఉండవచ్చు.

ఒక గ్రీకు సైనికుని బొమ్మకూడా నాగార్జునకొండ శిథిలాలలో లభించింది. గ్రీకు, రోమన్ సైనికులు పలువురు భారతదేశంలో స్థిరపడి, శాతవాహన, ఇక్ష్వాకు రాజులవద్ద కొలువుచేసేవారు. అంతర్జాతీయ సంస్కృతిలోని క్రొత్త విషయాలన్నిటినీ వెంట వెంటనే స్వీకరించుటలో నాడు ఆంధ్రులకు గల అభినివేశం పై నిర్మాణముద్వారా వ్యక్తంకాగలదు. బహుశా ఈ స్టేడియం ఉపన్యాసాలకు మాత్రమేకాక, బహిరంగ నాటకప్రదర్శనలకు కూడా ఉపయోగపడి ఉండవచ్చు.

నాగార్జునకొండ శిల్పాలు శాతవాహన యుగంలో ప్రారంభమై ఇక్ష్వాకురాజుల కాలంలో, ఉన్నత స్థాయినందుకున్నాయి. యజ్ఞశ్రీ శాతకర్ణి, నాగార్జునుని కొరకు కట్టించిన పారావత విహారం ఇంకా బయల్పడలేదు. హుయత్సాంగ్ వర్ణనలను గురించి, అయిదు అంతస్తులుగల ఆ పారావత విహారంకూడా ఇక్కడనే ఉండాలి. త్వరలో అదికూడా బయల్పడుతుందని ఆశించవచ్చు.

ఇక్ష్వాకుల రాజధాని విజయపురి కూడా ఈ లోయ లోనే ఉన్నది. ఆ నగర శిధిలాలుకూడా నేడు బయల్పడు తున్నాయి. కృష్ణానదీ తీరంనుండి నాగార్జున కొండమీదికి రాతితోను, ఆ తర్వాత ఇటుకలతోను కట్టిన మెట్లు బయట పడ్డవి. ఈ మెట్లు నిటారుగా కాకుండా, వాలుగా ఉన్నాయి. సులువుగా నదిలోనుండి కొండపైకి ఎక్కవచ్చు. ఈ మెట్లకు ఉత్తరదిశగా 100 చలువరాతి స్తంభాలుగల ఒక శిథిలభవనం బయల్పడ్డది.

పరిశోధనలు జరిగినకొలదీ విజయపురీ నగర శిథిలాలు ఒక్కొక్కటే బయల్పడగలవని ఆశిద్దాం.

విజయపురి ఇక్ష్వాకు రాజుల రాజధాని. ఇక్ష్వాకు రాజులలో మొదటివాడైన వాసిష్ఠీపుత్ర చాంతమూలుడు, లక్ష నాగళ్ళ భూమిని రైతులకు దానంచేసి, ఊసర క్షేత్రా లను సస్యశ్యామలం చేశాడు. అతని కుమారుడు వీరపురుష దత్తుడు బౌద్ధమతాన్ని విశేషంగా అభిమానించి, వృద్ధా ప్యంలో రాజ్యపరిత్యాగం చేసి బౌద్ధభిక్షువైనాడు.

చాంతమూలుని చెల్లెలు, వీరపురుష దత్తుని అత్తయిన శాంతిశ్రీ, నాగార్జునకొండవద్ద స్తూపాలకు, చైత్యాలకు విశేష ధనసహాయం చేసింది. విశ్వవిద్యాలయంలో కొన్ని గదులను కట్టించింది. ఇక్ష్వాకు రాణులందరు గాఢమైన అభిమానంతో నాగార్జునకొండ శిల్పనిర్మాణానికి విశేష సహాయంచేశారు.

బుద్ధుని జీవితగాథలు, వీరపురుష దత్తుని జీవిత విశే షాలు, సమకాలీన విషయాలు అన్నీ చలువరాతి పలకలపై

అతి సుందరంగా నాగార్జున కొండలో చెక్కబడి ఉన్నాయి. నాగార్జునకొండ శిల్పసంపద ఆంధ్రుల ప్రాచీన వైభవానికి ప్రత్యక్ష తార్కాణం.

## యావదాంధ్ర శిల్పవైభవం

బౌద్ధయుగంలో అమరావతి, నాగార్జునకొండ ప్రాంతాలలో మాత్రమేకాక ఆంధ్రదేశంలోని అన్ని ప్రధాన జిల్లాలలోను, బౌద్ధ విహారాలు, చైత్యాలు వందలకొద్ది ఏర్పడినవి. బౌద్ధ సంస్కృతిని ఆంధ్రప్రజలు ఆబాలగోపాలం హృదయపూర్వకంగా జీర్ణంచేసుకున్నారనటానికి ఈ ప్రాచీన బౌద్ధక్షేత్రాలే నిదర్శనలు.

శ్రీకాకుళం జిల్లాలోని వంశధార నదిఒడ్డున కళింగపట్నానికి 3 మైళ్ళ ఎగువన సాలిహుండాం అను ఒకగుట్ట ఉంది. ఆ గుట్టపైన అనేక చైత్యములు, విహారములు బయల్పడినవి. వందలాది బౌద్ధభిక్షువులు ఇచ్చట నివసించేవారు. సముద్రయానంలో అనాదినుండి కుశలులైన కళింగప్రజలు ఈ క్షేత్రంనుండి బయలుదేరి, మాతృదేశానికి వీడ్కోలిచ్చి, జావా, ఇండొనేషియా దీవులకు వలసవెళ్ళారు. తూర్పుదీవులకు భారతీయ సంస్కృతినిచేరవేసిన ప్రధానబౌద్ధక్షేత్రాలలో సాలిహుండాంఒకటి. ఈ చైత్యం శాతవాహనరాజుల కాలంలో నిర్మించబడి, ఆపిమ్మట కూడా అభివృద్ధి చెందింది. వజ్రయాన మతధోరణికి చెందిన కొన్ని శిల్పాలు యిచ్చట బయల్పడినందున క్రీ. శ. 6 వ శతాబ్దివరకు ఈ క్షేత్రం భిక్షువులకు ఆవాస కేంద్రంగా ఉన్నట్లు బోధపడుతుంది.

విశాఖజిల్లా విజయనగరం తాలూకాలోని రామతీర్థం వద్ద వున్న గుట్టపైన ఒక మహాచైత్యము, 6 చైత్య గృహాలు, విహారాలు బయల్పడినవి. కొన్ని వందలమంది బౌద్ధభిక్షువులు ఇక్కడ నివసించేవారు.

విశాఖజిల్లా అనకాపల్లి తాలూకాలోని శంఖవరం గ్రామ సమీపంలో బొజ్జన్నకొండమీద ఒక మహాచైత్యము, పెక్కు విహారాలు బయల్పడినవి. ఈ క్షేత్రం, రామతీర్థం, శాలిహుండాంలకంటె పెద్ద కేంద్రమైనట్లు అచ్చటి విహారాల సంఖ్యను బట్టి బోధపడుతుంది. ఈ చైత్యములలో వేంగీ చాళుక్యరాజైన కుబ్జ విష్ణువర్ధనుని నాణెములు లభించినవి. 7 వ శతాబ్దివరకు ఈ విహారం వాడుకలో వున్నది.

తూర్పు గోదావరిజిల్లా రాజోలు తాలూకాలో ప్రవహించే గోదావరి పాయిలలో ఒకటైన వైనతేయం ఒడ్డున ఆదుర్రు గ్రామం ఉంది. ఈ గ్రామంలో ఒక బౌద్ధ చైత్యం ఈమధ్యనే బయల్పడ్డది. సముద్రానికి ఇచ్చటికి 1 మైలు మాత్రమే దూరం.

ఆదుర్రు చైత్యం అతి ప్రాచీనమైనదిగా తెలుస్తున్నది. చుట్టుప్రక్కల ప్రాంతాలలో ఎచ్చట తవ్వినా ప్రాచీన శిథిలాలు బయల్పడుతున్నాయి. ఇచ్చట కేవలం చైత్య గృహం మాత్రమే కాక ఒక బౌద్ధ విద్యాలయం కూడా ఉండేదని భావించవచ్చు.

కృష్ణానదీ తీరంలో, నది కిరుప్రక్కల అసంఖ్యాకములైన బౌద్ధక్షేత్రాలు బయల్పడినవి. బౌద్ధక్షేత్రాలు సర్వసాధారణంగా నదులఒడ్డున నిర్మించబడేవి. కృష్ణా తీరవాసులు

బౌద్ధమతంపట్ల ప్రత్యేక అభిమానం చూపి, అసంఖ్యాకమైన క్షేత్రాలను నిర్మించారు. సుప్రసిద్ధమైన అమరావతి, నాగార్జునకొండలు, కృష్ణ ఒడ్డున గుంటూరు జిల్లాలో ఉన్నవి. ఈ రెండూకాక, పల్నాడు తాలూకా రెంటచింతలకు రెండుమైళ్ళ దూరంలో గోలి అను ఒకగ్రామం ఉంది. ఈ గ్రామం గోళ్లేరను ఏటి ఒడ్డున ఉన్నది. ఇచ్చట ఒకచైత్యం బయల్పడినది. ఈ చైత్య ఫలకములమీద అమరావతీ శిల్ప సాంప్రదాయమునకు చెందిన శిల్పాలు అనేకం ఉన్నాయి.

గోలి గ్రామానికి సమీపంలో రెంటాల, మాడుగుల, సమాధానపురం, మంచికల్లు మొదలైన గ్రామాలలో బౌద్ధ శిల్పాలు బయల్పడినవి. గుంటూరుజిల్లా పల్నాడు తాలూకాలోని ప్రతిఅంగుళం నేల బౌద్ధుల నివాసస్థలంగా ఉన్న ప్రాంతమే. నాగార్జునాచార్యుని ప్రతిభ, ఆ తాలూకాలోని మారుమూల గ్రామాలలో సైతం వ్యాపించిన ఫలితంగా ప్రతి గ్రామంలోను ఏదో ఒక బౌద్ధ నిర్మాణం వెలిసింది.

ఇవిమాత్రమేకాక, గుంటూరు జిల్లాలోని రేపల్లె తాలూకాకు చెందిన భట్టిప్రోలు, మోటుపల్లి గ్రామాలలోను, బాపట్ల తాలూకాకు చెందిన బుద్దాం, కనుపర్తి గ్రామాలలోను, తెనాలితాలూకాకు చెందిన చేబ్రోలులోను, సత్తెనపల్లితాలూకాకు చెందిన వేల్పూరులోను, నర్సారావుపేట తాలూకాకు చెందిన చేజెర్లలోను చైత్య గృహాలు బయల్పడినవి.

కృష్ణాజిల్లా వైపుగా గుడివాడ, ఘంటసాల, జగ్గయ్యపేట, రామిరెడ్డిపల్లి, గుంటుపల్లి ప్రాంతాలలో బౌద్ధ చైత్యా

లున్నాయి. వీనిలో ఘంటసాల అతి ప్రసిద్ధం. అది ప్రాచీన కాలంలో ఒక పెద్ద నగరంగా ఉండేది. జగ్గయ్యపేట 6 వ శతాబ్దిలో నివసించిన సిద్ధ నాగార్జునుని నివాసస్థలం.

తెలంగాణాలో కూడా బౌద్ధ చైత్యాలు, నిర్మాణాలు విశేషంగా ఉన్నాయి. మెదకుజిల్లా కొండాపురం గ్రామంలో ఈమధ్య అనేక శిథిలాలు బయల్పడినవి. ఈ గ్రామం పక్కనే ఒక ఏరు ప్రవహించి 12 మైళ్ళ దూరంలో ఉన్న మంజీరా నదిలో కలుస్తుంది. కొండాపురం ఒక ప్రాచీన మహానగరం అని శిథిల అవశేషాలు తెలియజేస్తున్నాయి. శాతవాహన రాజులయొక్క, రోమను చక్రవర్తుల యొక్క నాణెములు, దుకాణాల వరుస, వీధులు, భవనాలు, మెట్లు, ఇనుప ఆయుధాలు, నేలమాళిగలు, రకరకాలైన మట్టిపిడతలు లభించినవి. రెండు చైత్యగృహాలు, మూడు స్తూపములు, మూడు విహారములు ఉన్నవి. కొండాపురం ఒక గొప్ప బౌద్ధ క్షేత్రమని స్పష్టం.

నల్లగొండ జిల్లా సూర్యాపేట తాలూకా ఫణిగిరిలో ఒక బౌద్ధ స్తూపం, విహారం బయల్పడినవి.

ఫణిగిరి సమీపంలో గాజులబండలో కూడ ఒక స్తూపం బయల్పడినది.

ఆంధ్రదేశం నలుమూలలా బౌద్ధమతం వ్యాపించినదని, ఆంధ్ర శిల్పుల నిర్మాణ కౌశలం, శిల్పచాతుర్యము, ఈ యుగంలో పరాకాష్ట నందుకున్నదని పై విషయాలు స్పష్టం చేస్తున్నాయి.

## తాత్వికరంగం

బౌద్ధయుగంలోని ఆంధ్ర వైభవం శిల్పానికి మాత్రమే పరిమితం కాలేదు. తాత్వికరంగంలోను, సంస్కృతీ వికసనలోను ఆంధ్రులు ఉన్నతస్థాయి నందుకున్నారు.

బౌద్ధ విద్యా కేంద్రాలలో వేలకొలది విద్యార్థులు మత కుల విభేదాలులేక విద్య నార్జించేవారు. ఈ విద్యాలయాలలో తర్కం, తత్వశాస్త్రం, వైద్యం, రసాయనశాస్త్రం, శిల్పం, చిత్రకళలు బోధించబడేవి.

బౌద్ధయుగంలో ప్రసిద్ధిచెందిన తత్వవేత్తలు పలువురు ఆంధ్రలో నివసించారు. వీరిలో నాగార్జునుడు, దిఙ్నాకుడు, బుద్ధాపాలితుడు, భావవివేకుడు మొదలైన వారు ముఖ్యులు.

మహాయాన బౌద్ధమతానికి చెందిన నాగార్జునుడు శూన్యవాద సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు.

ప్రపంచంలో ఏదీ శాశ్వతం కాదు. ఏదీ స్థిరం కాదు. ప్రతిదీ పుట్టి పెరిగి నశిస్తుంటుంది. పరిణామశీలమైన ఈ ప్రపంచంలో 'సర్వం క్షణికం' ఆత్మలేదు, దేవుడులేదు — ఇవి బుద్ధుని తత్వశాస్త్రంలోని మూల సూత్రాలు.

బుద్ధుని అనంతరం మహాయాన మత స్థాపకుడైన అశ్వఘోషుడు ఈ సిద్ధాంతాన్ని మార్పుచేశాడు. ఆత్మకు, రెండు విభాగాలున్నాయి. ఒకటి సంసార విభాగం, రెండవది తథత విభాగం. సంసార విభాగం నిత్య పరిణామ శీలం. కాని తథత విభాగం మార్పులేని శాశ్వత పదార్థం. ఇదీ అశ్వఘోషుని బోధ.

బుద్ధుని తత్వశాస్త్రంలోని మూలసూత్రానికే ఇది విరుద్ధమని వేరే చెప్పనక్కర లేదు. అతను నిరాకరించిన బౌద్ధ తత్వశాస్త్రంలోని, ఆత్మభావం దొడ్డిదారిన ప్రవేశపెట్టబడింది.

నాగార్జునుని శూన్యవాదం, బుద్ధుని ప్రగతిశీల దృక్పథాన్ని పునరుద్ధరించటానికి జరిగిన ఒక గొప్ప యత్నం. ప్రతిదీ శూన్యం. అనగా పరస్పరాధారం. ఏదీ స్వయంసిద్ధం కాదు. కనుక ప్రతిదీ పరిస్థితులనుబట్టి మారుతూంటుంది. "శూన్యత లేని ధర్మమే లేదు."

నాగార్జునుని పరస్పరాధార సిద్ధాంతం, గతితార్కిక దృక్పథానికి సన్నిహితమైన దృక్పథం.

యోగాచార బౌద్ధశాఖకు మూలపురుషుడైన దిజ్నాగుడు, 5 వ శతాబ్ద ప్రారంభంలో, పశ్చిమ గోదావరి జిల్లా వేంగీనగరంలో నివసించాడు. దిజ్నాగునిది యోగాచార వాదం. నాగార్జునుని పరస్పరాధార సిద్ధాంతానికి పూర్తి వ్యతిరేకం. పరిణామశీలమైన భౌతికప్రపంచం అవాస్తవం. పరిణామరహితమైన భావప్రపంచమే వాస్తవమైనది. ఈ భావ ప్రపంచాన్ని దిజ్నాగుడు ఆలయ విజ్ఞానం అని పిలిచాడు.

బుద్ధపాలితుడు, భావవివేకుడు మొదలైన బౌద్ధ తాత్వికులు కూడా ఆంధ్రలో నాడు నివసించారు. బౌద్ధ తాత్వికులలో అగ్రశ్రేణికి చెందిన నాగార్జునుని నివాసస్థలమైన ఆంధ్రదేశం, బౌద్ధరంగంలో అంతర్జాతీయ ఖ్యాతిని గడించింది.

# పతనావస్థ

క్రీ. శ. 4 వ శతాబ్దికే బౌద్ధమతంలో పతన చిహ్నాలు ప్రారంభమైనాయి.

నాగార్జునుని శూన్యవాదం తాత్వికంగా ఉన్నతస్థాయికి చెందినదైనప్పటికీ, ఆపాటికే బౌద్ధమతంతో విస్తార ప్రచారం పొందిన విగ్రహారాధన జాతకకథలు, మూఢవిశ్వాసాలను భేదించి స్వేచ్ఛా ఆలోచనకు సహాయపడలేక పోయినాయి. బుద్ధుని కార్యకారణ సిద్ధాంతం ప్రారంభంలో కలిగించిన విప్లవకర పరిణామాలను నాగార్జునుని శూన్యవాదం కలిగించలేక పోయింది. దిజ్ఞాగుని యోగాచారవాదంతో బౌద్ధతత్వశాస్త్రం తన ప్రత్యేకతను పూర్తిగా కోల్పోయి, స్వకీయాత్మక భావవాద ధోరణిగా రూపొందింది. శంకరుని అద్వైత ధోరణికి, దిజ్ఞాగుని యోగాచార వాదానికి గల వ్యత్యాసం అతి స్వల్పం. దృశ్యమాన ప్రపంచం అంతా మిథ్య అని ఏనాడు బౌద్ధమతం తెలియచేసిందో, ఆనాడే దాని విశిష్టత నశించింది.

మూఢవిశ్వాసాలు వెర్రితలలు వేశాయి. మంత్ర తంత్రములలో విశేష శ్రద్ధను చూపే వజ్రయాన బౌద్ధం తల ఎత్తింది. నైతిక పారిశుద్ధ్యానికి ప్రథమస్థానం ఇచ్చిన బౌద్ధ మతంలో, అవినీతికర ప్రవర్తనను ఏవో సాకులతో సమర్థించే వజ్రయానం తలఎత్తటం, నిజంగా ఆశ్చర్యకరం.

అర్థబానిస విధానం సుస్థిరంకావటంతో బౌద్ధమతం యొక్క చారిత్రక ప్రయోజనం ముగిసింది. ఒక నిర్దిష్ట యుగంలో, నిర్దిష్టపరిస్థితులలో; విప్లవకర పాత్ర వహించిన ఒక

సిద్ధాంతం, కాలానుగుణ్యంగా మార్పు చెందని యెడల ఆ యుగం, ఆ పరిస్థితులు మారిపోయినమీదట, ఎలా నీళ్ళుగారి నశించిపోతుందో తెలుసుకునేందుకు బౌద్ధతత్వశాస్త్రం చక్కని ఉదాహరణ.

క్రీ. శ. 6 వ శతాబ్దినాటికి బౌద్ధమతం ఆంధ్రలో తన ప్రభావాన్నంతా కోల్పోయింది. పల్లవ, విష్ణుకుండిన రాజుల మతద్వేషవిధాన ఫలితంగా అనేక బౌద్ధారామాలు ధ్వంసమైనాయి. బుద్ధవిగ్రహాలు, విష్ణుమూర్తి బొమ్మలుగా రూపాంతరం చెందాయి. స్తూప శిథిలాలపై దేవాలయాలు లేచినవి. కాని అచ్చటచ్చట మిగిలిపోయిన బౌద్ధ విహారాలలో బౌద్ధ గురువులు, భిక్షువులు తమ మత ప్రచారాన్ని చాలాకాలం వరకు చేస్తూనేవచ్చారు. కొందరు రాజులు చెదురుచెదురుగా బౌద్ధమతాన్ని అభిమానిస్తూనే వచ్చారు. పల్లవరాజైన సింహవర్మ ధాన్యకటకంలోని వీతరాగుడైన బుద్ధదేవుని పూజించి బుద్ధ ఉపాసకుడైనాడు. (క్రీ.శ. 500) క్రీ. శ. 1100 ప్రాంతంలో వెలనాడును పరిపాలించిన వెలనాటి చోడుడు, బౌద్ధ గురువుల ఆదరించాడు. వీరశైవ మత ప్రచారకుడైన మల్లిఖార్జున పండితారాధ్యుడు, ఈ బౌద్ధ గురువులతో వాదించి, అంతటితో ఊరుకోక, తన శిష్యులచే వారిని హత్య చేయించాడు. 12 వ శతాబ్దం తర్వాత ఆంధ్రలో బౌద్ధమతం నిశ్శేషంగా నశించిపోయింది.

(24–5–56, బుద్ధ జయంతి సంచిక)

# శాతవాహనులనాటి సామాజిక వ్యవస్థ

ప్రాచీనాంధ్ర చరిత్ర, బానిసవిధానం పతనమవడంతో ప్రారంభమైంది. బానిస సామ్రాజ్యాల దోపిడీక్రింద నలిగి పోతున్న 'ఆంధ్ర' తెగలు కొత్తప్రాంతాలకు తరలిపోయి అక్కడవున్న మరికొన్ని ప్రాచీన తెగలతో కలిసి, నూతన ఆర్థిక పునాదిపై ఏకైక జాతిగా రూపొందసాగారు. గ్రామ కమ్యూన్ పై ఆధారపడిన అర్ధబానిస విధానమే ఈనూతన ఆర్థిక పునాది.

ఆంధ్రుల చారిత్రక పరిణామాన్ని సమగ్రంగా తెలుసు కోవాలంటే, ఆపరిణామం జరిగిన, జరుగుతున్న సామాజిక దశ(Social stage)ను గురించి తెలుసుకోవాలి. ప్రజలవుత్పత్తి శక్తులస్థాయి, ఉత్పత్తిసంబంధాలు - మరొక మాటలో చెప్పా లంటే ప్రధానంగా గ్రామీణ జీవితంలోని ఆస్తిసంబంధాలు - వీనినిగురించి క్షుణ్ణంగా తెలుసుకోవాలి.

ఈ సమస్యపై ఇదమిత్థమని నిర్ణయించగల ఖచ్చితమైన సమాచారసేకరణ ఇంకా జరగలేదు. కాని స్థూలంగా కొన్ని సూత్రీకరణలు చేయవచ్చు.

క్రీ. పూ. 600 - క్రీ. పూ. 150 మధ్య భారతదేశం లోని సామాజిక పరిస్థితులను పరిశీలిస్తే, బానిస సమాజం పతనం చెంది, అర్ధబానిస విధానం ప్రారంభమౌతున్న సంధి కాలంలో, ఆంధ్రప్రజలు, తెగల దశనుండి బైటపడి సుస్థిర గ్రామజీవిత పునాదిపై నివసించసాగినట్లు మనంగ్రహించగలం.

భారత సమాజం మొత్తంమీద బానిస సమాజ దశ నుండి అర్ధబానిస సమాజ దశకు మారిందని చెప్పి, అదే కాలంలోనే ఆంధ్రులు మాత్రము తెగల దశనుండి అర్ధబానిస విధానానికి మారుతూ వచ్చారని చెప్పటం సరియైనదేనా అని సందేహం కలగవచ్చు. ఈ సందేహం నిరాధారము.

భారతదేశం మొత్తంమీద బానిస సమాజం పతనమై అర్ధబానిస సమాజం ప్రారంభమైందని చెప్పినంత మాత్రాన దేశంలోని ప్రతిఒక్క ప్రాంతంలోను, అన్నిమూలలా అదే పరిణామం జరిగిందని భావించ నక్కర లేదు.

గంగా యమునా తీరంలో బానిస విధానం, దానిపై ఆధారపడిన నిరంకుశ రాజ్యాలు క్రీ. పూ. 1500 నుండి 600 వరకు నిరాఘాటంగా సాగినవి. ప్రారంభంలో బానిస విధానం తెగల బానిసవిధానంగా ఉండేది. గెలిచిన తెగ యావత్తూ బానిస యజమానులై, ఓడిపోయిన తెగవారంతా బానిసలుగా మారిపోయేవారు. బానిస యజమానుల తెగలోకూడా వర్గవిభేదాలు, స్వంతకుటుంబాలు ఏర్పడినమీదట, బానిసలను తమలోతాము పంచుకోవటం ప్రారంభమైంది. ఒక్కొక్క కుటుంబం కొన్ని వందలమంది బానిసలను సంపాదించుకునేది. క్రీ. పూ. 600 నాటికి, ఈ రకమైన కుటుంబ బానిసల వ్యవస్థ గ్రామాలలోను, పట్టణాలలోను ఏర్పడ్డట్లు బౌద్ధజాతక కథల ద్వారా తెలుస్తున్నది.

ఐతే పట్టణాలకు గ్రామాలకు ఈ విషయంలో ఒక తేడావుంది. పట్టణాలలో స్వంత ఆస్తి, కుటుంబ బానిసలు



ఏర్పడగా, గ్రామాలలో నామమాత్రంగా నైనప్పటికి భూమిపై 'సమష్టి' యాజమాన్యం ఉండేది. వ్యవసాయం మాత్రము కుటుంబాలు విడి విడిగా చేసుకుంటూ ఉండేవి. ఆదిమ కమ్యూనిస్టు సమాజ లక్షణమైన 'సమష్టి' స్వభావము పట్టణాలలో పూర్తిగా నశించింది. గ్రామాలలో అలా కాక నిలిచివుంది. ఈ 'సమష్టి' హక్కు బానిస యజమానుల మధ్య నే అన్న విషయం మరచిపోరాదు. బానిసల హోదా, దోపిడీ విషయం వచ్చేప్పటికి పట్టణాలకు, గ్రామాలకు ఎట్టి తేడా లేదు. గ్రామాలలో బానిసలచే సాగు చేయించుకొని ఆ శ్రమఫలితాన్ని బానిస యజమానుల కుటుంబాలు అనుభవించేవి. బానిసలను హీనజాతులు అని నామకరణం చేశారు. ఈ గ్రామీణ వ్యవస్థను కుటుంబ కమ్యూన్ లేక కులపతి వ్యవస్థ అనవచ్చు. గ్రామం మొత్తంమీద 10, 20, పెద్ద కుటుంబాలు ఉండేవి.

ఈ 'కుటుంబ' వ్యవసాయ పద్ధతి అవశేషాలు చాలా కాలంవరకు మనదేశంలో నిలిచినవి. ఇంగ్లీషువారు వచ్చిన ప్రారంభంలో మనదేశంలో అక్కడక్కడ సాగుతున్న ముఠా వ్యవసాయం, ఈ పద్ధతియొక్క అవశేషము, తప్ప వేరు కాదు.

ఆంధ్రుల దక్షిణదేశయాత్ర క్రీ. పూ. 100 నుండి ప్రారంభమైంది. బానిసలుగా బ్రతకటానికి నిరాకరించిన ఆదిమ కమ్యూనిస్టు తెగలు, తాముకూడాకొంత బానిస విధానంలో అడుగిడినప్పటికి, అభివృద్ధిచెందిన ఇతర బానిస తెగల పోటీకి తట్టుకోలేని తెగలు దూరప్రాంతాలకు తరలిపోయేవారు. ఆంధ్రుల మహాప్రస్థానంకూడా ఇలాంటిదే. ఒకవైపున బానిస

విధానం. మరొకవైపున ఈ తెగలు పక్క-పక్కనే దీర్ఘకాలం జీవించిన ఉదాహరణలు మన దేశంలోనే గాక, యూరపు చరిత్రలో కూడ కనుపిస్తాయి.

యూరప్‌లో బానిస విధానంపై తల ఎత్తిన రోమను సామ్రాజ్యం క్రీ. పూ. 500 - క్రీ. శ. 200 మధ్యకాలంలో మధ్యధరా దేశాలను మాత్రమేగాక, ఆఫ్రికా ఖండాన్ని కూడా జయించింది. యూరపు నంతటినీ ఆక్రమించ ప్రయత్నించింది. ఆసియా ఖండంవైపు విస్తరించ యత్నించింది.

ఈ సామ్రాజ్యానికి, ఉత్తర యూరప్‌లోని జర్మన్ కెల్టు, డేనిష్‌సాక్సన్ తెగలకూ నిరంతరపోరాటాలు వందల ఏండ్లు జరిగాయి. తూర్పున అరబ్ తెగలు, పాలెస్టయిన్‌లోని యూదు తెగలు - ఈ సామ్రాజ్యాన్ని ప్రతిఘటించాయి. చిట్టచివరకు, రోమన్ సామ్రాజ్య పతనానికి, బానిసల తిరుగుబాటుతోపాటు, తెగల దశలో జీవిస్తున్న జర్మనులదండయాత్రలుకూడా ప్రముఖ కారణామైనాయి. యూరప్‌లో బానిస సమాజం అంతటితో అంతరించి, అర్ధబానిస విధానం ప్రారంభమైంది. అంతేకాదు. ఇటలీ. ఫ్రెంచి, జర్మన్, జాతుల ప్రత్యేక పరిణామానికి కూడా ఇదే నాంది.

భారతీయ సమాజ పరిణామంలో కొన్ని ప్రత్యేక లక్షణాలున్న మాట నిజమే. కాని సాధారణ పరిణామ సూత్రాలు అంతటా ఒకేరకంగా ఉన్నాయి.

## బానిస విధాన పతనం

క్రీ. పూ. 600 నుండి మన దేశంలో బానిస సమాజం పతనం కానారంభించింది. బౌద్ధమతం ఈపరిణామానికవసర

మైన నూతన సిద్ధాంతాన్ని సృష్టించి, సాంఘిక విప్లవానికి నాయకత్వం వహించింది. బానిస విధాన కాఠిన్యత, ఉత్పత్తి శక్తుల అభివృద్ధికే ఆటంకంగా పరిణమించింది. బానిసలు అడవులలోకి పారిపోవడం, తెగలకు, తెగలు గుంపులకు గుంపులు కొత్తప్రాంతాలకు తరలిపోవటం, (ఆపస్తంబుని నాయకత్వాన ఆంధ్రులలో మరొకగుంపు క్రీ.పూ. 600 లో దక్షిణానికి బయలుదేరారు) పెద్దసామ్రాజ్యాలు అంతరించి చిన్న చిన్న రాజ్యాలు అనేకం ఏర్పడటం, హత్యలు, దారి దోపిడీలు, దొంగతనాలు – ఒక పెద్ద సాంఘిక సమస్యగా పరిణమించటం ఇవన్నీ ప్రారంభమైనవి.

ఇంతేకాదు, బానిసవిధాన తీవ్రత క్షత్రియ కులాలకు కూడా వ్యాపించింది. కొన్ని క్షత్రియ కుటుంబాలు తాము మాత్రమే నిజమైన క్షత్రియులమని, ఇతరరాజులు ఒకప్పుడు తక్కువ కులాలలో ఉండి ఏదోవిధంగా రాజ్యం సంపాదించిన వారని, కనుక తమకంటె తక్కువ అనీ భావించటం ప్రారంభమైంది. ఇది అంతర్యుద్ధాలకు మరొక కారణమైంది. గౌతమ బుద్ధుడు జన్మించిన శాక్యవంశీకులు లిచ్ఛావీలను మరొక రాజవంశంతో, పై కారణంవల్ల తగాదాపడ్డారు. లిచ్ఛావీలు తక్కువ కులానికి చెందినవారనే సాకుతో వారి ఆడుబిడ్డను శాక్యరాజొకడు వివాహ మాడటానికి నిరాకరించి అవమానించాడు. ఇరువర్గాలకు ఘోరయుద్ధం జరిగి, వేలాది వీరులు నశించారు. అప్పటికి బుద్ధుడు బుద్ధత్వము ఇంకా పొందలేదు. ఈ యుద్ధాన్ని నివారించటానికి బుద్ధుడు ఎంతో కృషి చేసాడు. కాని ప్రయోజనం లేకపోయింది.

బానిస విధానం పతనం చెందసాగింది. రాచరిక వ్యవస్థలోకూడా మార్పువచ్చింది. పాటలీ[illegible] రాజధానిగా

పరిపాలించిన నందసామ్రాజ్యం బానిస ప్రభుత్వాలలో ఆఖరుది. (క్రీ. పూ. 350) అశోక సామ్రాజ్యం (క్రీ. పూ. 250 అర్ధబానిస విధానంలో మొట్ట మొదటి ప్రభుత్వం. ఈ మధ్య వచ్చిన చంద్రగుప్తుని సామ్రాజ్యం, నందసాంమ్రాజ్యంపై చంద్రగుప్తుని తిరుగుబాటు, మురఅను బానిస పుత్రుడై చంగ్రుప్తుడుజరిపిన ఈ తిరుగుబాటుకు, కుట్రలకు. చాణక్యుని సహాయం-ఇవన్నీ పరిణామదశ చిహ్నాలు. మహాపద్మనందుని ముఖ్యమంత్రి ఐన రాక్షసుడు చంద్రగుప్తుని అధికారాన్ని చాలాకాలంవరకు ధిక్కరించి చివరకు చాణక్యుని సలహాపై అతనివద్ద ముఖ్యమంత్రిగా చేరటం (ముద్రా రాక్షసకథ) కేవలం వ్యక్తిగతమైన విషయంకాదు. పాత సమాజంలోని పరిపాలకవర్గాలు. నూతన జమాజ పరిపాలకవర్గాలతో చేసుకున్న రాజీ మాత్రమే.

## 'ఆంధ్రుల' సామాజిక దశ

ఈ పరిణామం ఉత్తర హిందూస్థానంలో జరుగుతూం డగా ఆంధ్రుల పరిస్థితి ఎలా ఉంది? క్రీ. పూ. 500 నాటికే ఆంధ్ర రాజులు బలమైన కోటలు కట్టుకొని పరిపాలన సాగిస్తున్నారని, చంద్రగుప్తుని వద్దనున్న గ్రీకు రాయబారి మెగాస్థనీసు వ్రాతల వల్ల తెలుస్తున్నది. ఆంధ్రులు, స్థానికులైన, తెలుగు, నాగ యక్ష-ఇత్యాది తెగలతో కలిసిపోయి, స్థిర నివాస మేర్పరచుకొని, చిన్న చిన్న రాజ్యాలను, కోటలను నిర్మించుకున్నారు. ఐతే వీరి సామాజిక వ్యవస్థ ఏది?

ఉత్తర హిందూస్థానం నుండి తెగల దశలో ఆంధ్రులు దిగివచ్చి, ఇతర తెగలలో కలిసిపోయినారని చెప్పినంత మాత్రాన తెగలను కేవలం ఆదిమ కమ్యూనిస్టు

తెగలుగా మనం భావించరాదు. రక్తసంబంధీకులు మాత్రమే కలిసి తెగలుగా వ్యవహరించటం, ఆదిమ కమ్యూనిస్టు సమాజలక్షణం. కాని వీరు అటువంటివారు కాదు.

బానిస సమాజంపై ఆధారపడ్డ ప్రభుత్వాలతోను, తెగలతోను కలహించి తెంచుకొనివచ్చినప్పటికి, ఈ తెగలలో కూడ బానిసవిధాన లక్షణాలైన వర్గభేదాలు, వర్ణభేదాలు ఏర్పడ్డాయి. వ్యవసాయం, వ్యాపారం-తదితర వృత్తులు వీరికి వచ్చు ఆపస్తంబ గృహ్యసూత్రాలను ఆంధ్రులు పాటించేవారట. వర్ణభేదాలు, ప్రత్యేక కుటుంబవ్యవస్థ ఏర్పడ్డమీాదట అగ్రవర్ణాలవారు అవలంబించే ఆచార వ్యవహారాలకు సంబంధించినవే ఈ గృహ్య సూత్రాలు.

ఐతే, గంగా యమునా తీరంలోని బానిస రాజ్యాల ప్రజలకు తరలివచ్చిన ఆంధ్రులకు సామాజిక వ్యవస్థలో తేడా లేదా? ఉత్తర హిందూ స్థానంలోని తెగలు బానిస విధానంలో అత్యున్నత స్థాయికిపోయి అధికారాన్ని చేబట్టి వైభవం అనుభవించి,పతనావస్థలో అడుగిడినవారు. ఆంధ్రులు కూడా అదేనమూనాలో (Frame work) జీవిస్తున్నప్పటికి, పై తెగల పోటీకి, దురాక్రమణకు, దౌర్జన్యానికి తట్టుకోలేక నే తరలి పోయారు. ఆంధ్రులభవిష్యత్తు పతనావస్థలోవున్న బానిస సమాజవ్యవస్థ ద్వారాగాక, అప్పుడప్పుడే తలఎత్తుతున్న అర్ధబానిస వ్యవస్థలోనే ఇమిడి ఉన్నది. కనుకనే అతి త్వరగా ఆంధ్రులు, నూతన వ్యవస్థఐన అర్ధబానిస విధానంలో ఇమిడిపోయినారు. ఆంధ్ర ప్రజల్లో అధికసంఖ్యాకులు ఐచ్ఛికంగా బౌద్ధమతాన్ని స్వీకరించారు. అశోకరాజు పరిపాలనలో నూతన వ్యవస్థను రుచిచూశారు. శాతవాహన యుగంలో

ఆత్మచైతన్యాన్ని పొంది, స్వతంత్ర ప్రభుత్వాన్ని ఏర్పరచుకొని, అర్థబానిస విధానంపై ఆధారపడిన సమాజ వ్యవస్థలో అతివేగంగా పురోగమించ సాగారు.

## అర్థబానిస విధానం

భారతదేశ మొత్తంమీద అశోకుని ప్రభుత్వము అర్థబానిస విధానానికి పునాదులు వేసినట్లుగానే, శాతవాహన రాజులు ఆంధ్రదేశంలో అర్థబానిస సామాజిక వ్యవస్థకు పునాది వేశారు. అర్థబానిస విధానాన్నే, భూస్వామ్య విధానం అనికూడా అంటున్నాము. సుస్థిర గ్రామ జీవితం ఏర్పరచటం, గ్రామంలోని వివిధ వృత్తులవారికి ప్రోత్సాహమివ్వటం ఆయా వృత్తులవారు, ఎంతెంతపన్ను చెల్లించవలెనో నిర్ణయించటం, ఇందులో గ్రామోత్పత్తిలో భాగస్వాములు కాని పురోహితవర్గానికి, గ్రామాధి కారులకు తదితరులకు ఎంత ఇవ్వాలి, ప్రభుత్వానికి ఎంత ఇవ్వాలి నిర్ణయించటం మొదలైన పనులు వీరు చేశారు.

ఒక గ్రామం, అందులోని భూమిపై 'సమష్టి' యాజమాన్యం, వ్యక్తిగత కుటుంబాలచే వ్యవసాయం, వ్యవసాయానికి అనుబంధంగా వివిధ వృత్తులు, ఈ వృత్తులవారు క్రమంగా ఘనీభవించి కులాలుగా మారిపోవటం, కష్టించి, చెమటోడ్చే తక్కువ కులాలవారు, గ్రామ పెత్తనాన్ని 'సమష్టి' యాజమాన్యాన్ని నిర్వహిస్తున్న పరాన్న భుక్కులైన క్షత్రియ, బ్రాహ్మణ కులాలకు, 'బలి' 'భాగం' అనే రూపంలో పన్ను ఇవ్వటం-వీరు ప్రభుత్వానికి గ్రామం మొత్తంమీద కొంతపన్ను చెల్లించటం— ఇది భారత అర్థబానిస విధానముయొక్క స్వభావం.

యూరపులో అర్థబానిస ఆరు నెలలు తన పొలములో పనిచేసేవాడు. మిగతా ఆరు నెలలు భూస్వామి (Feudal lord) పొలంలో ఉచితంగా పనిచేసేవాడు. ఈఆరు నెలలు వెట్టిచాకిరీ ఫలితాన్ని భూస్వామి కాజేసేవాడు. దోపిడీ నగ్నంగా కన బడేది. అర్థబానిస భూమిని వదలిపెట్టి వెళ్ళటానికి వీలులేదు. వెళ్ళితే భూస్వామి సైనికులు అతనిని తిరిగిపట్టుకు వచ్చేవారు. ప్రభుత్వచట్టం అందుకు అనుమతించేది. తాను సాగుచేసే భూమికి, భూస్వామికి ఇద్దరికి ఆతడు బానిస. ఈ రెండు మాత్రమేకాక ఇంకా అనేకమైన పన్నులు, మతగురువులకు, భూస్వామి కుటుంబానికి ఇచ్చుకోవలసి వచ్చేది. దీని నంతా కలిపి భూస్వామ్య విధానంలోని దోపిడీ అని వ్యవహరిస్తు న్నాము.

భారత అర్థబానిస విధానంలో గల ప్రత్యేకతఒకటే. యూరప్లో ఒక భూస్వామికి వేలాదిఎకరాలు, కొన్నిపదుల గ్రామాలు ఉండేవి. భూమిపై చట్టరీత్యా యాజమాన్యం అంతా భూస్వామిదే.

కాని మనదేశంలో, ఏ గ్రామానికి అదే కేంద్రం. భూస్వామిబదులు గ్రామ 'కమ్యూన్' లేక 'పంచాయితి' ఏర్ప డ్డది. భూమిపై పెత్తనం అక్కడ భూస్వామిదైతే, ఇక్కడ గ్రామ 'కమ్యూన్'ది.

గ్రామ 'కమ్యూన్' అనేది గాలిలోలేదు. గ్రామ పెత్తందార్ల చేతిలో అది ఒక కీలుబొమ్మ. ఈ పెత్తందార్లు బ్రాహ్మణ, క్షత్రియ కులాలవారు. 'కమ్యూన్' అనుముసుగు 'సమష్టి యాజమాన్యం' అను పదజాలం ఈరెంటిని తొలగిస్తే, గ్రామ జీవితంలోని పెత్తందార్ల దోపిడీమనకు స్పష్టమౌతుంది.

# గ్రామకమ్యూన్ దాని సామాజిక ప్రయోజనం

శాతవాహన యుగ ప్రారంభంలో ఇలాంటి సామాజిక వ్యవస్థ అత్యవసరమైంది. ఇందులో ఇమిడివున్న దోపిడీ క్రీ. పూ. 100 తర్వాత శాతవాహన రాజ్య పతనానంతరం మాత్రమే ప్రస్ఫుటమైంది. ప్రారంభంలో ఈ వ్యవస్థ ఒక ప్రయోజనకర పాత్రను నిర్వహించింది. ప్రతి వ్యక్తికి వృత్తి, గ్రామంలో జీవించే హక్కు, విరోధుల నుండి రక్షణ, వీటిని గ్రామ కమ్యూన్ కలిగించినది. అంతర్యుద్ధాలతో విసిగి వేసారిపోయిన వారికి, స్థిరజీవనము, ఆశ్రయము లేక, సంచారజాతులుగా, తిరుగుతున్న వారికి, యజమాని దయాధర్మాల పై ఆధారపడి అనుక్షణము దినదినగండముగా జీవించే బానిసలకు – వీరందరికి గ్రామ కమ్యూన్ ఒక మార్గం చూపింది. ఒక పరిష్కారం ఇచ్చింది. గణము, తెగ, మతము, కులము– ఇవి ఏవైనా సరే – ప్రమేయం లేదు. గ్రామస్థులందరు ఒకటి అనే ఉన్నత చైతన్యాన్ని కలిగించింది. ఆంధ్ర దేశంలో జైన బౌద్ధ మతస్థులు, హిందువులు, వారిలో వివిధ కులాలు వీరందరూ గణ గోత్ర సంబంధాలను పక్కకునెట్టి గ్రామ జీవితంలో భాగస్వాములైనారు.

వివిధ కుటుంబాలకు బానిసలుగా ఉంటున్న నీచ జాతులు మొత్తంగ్రామానికి చెందిన తక్కువ కులాలవారుగా మారిపోయినారు. కుటుంబ యజమానుల నిరంకుశ దోపిడీ స్థానంలో, గ్రామపెత్తందార్ల నియమబద్ధ దోపిడీ ప్రారంభమైంది. బానిసకు గ్రామ సభ్యుని హోదా లభించింది. యూరపులోని అర్ధబానిస తన భూమిని వదలి వెళ్ళటానికి వీలులేనట్లే, మన దేశంలో అర్థబానిస గ్రామాన్ని వదలి

వెళ్ళటానికి వీలులేదు. బానిస, అర్ధబానిస అయినాడు. అర్ధ బానిస' పేరు స్థానంలో అస్పృశ్యులు, తక్కువ కులాలు, వృత్తి కులాలు అనుపేర్లు వచ్చాయి. గ్రామకమ్యూన్, కుల వ్యవస్థ - ఇవి మనదేశంలోని అర్ధబానిస విధానానికి ప్రాతిపదిక. ఆదిమకమ్యూన్ కంటె, కుటుంబ కమ్యూన్ కంటె ఉన్నతస్థాయికి చెందిన ఈ గ్రామకమ్యూన్ నాటిపరిస్థితులలో అభ్యుదయకరపాత్ర వహించింది.

శాతవాహనరాజుల కాలంలో ఆంధ్రదేశంలో గ్రామ కమ్యూన్ పునాదిపై ఉత్పత్తిశక్తుల అభివృద్ధి విపరీతంగా సాగింది. వివిధ వృత్తిపనివారల సంఘాలను (శ్రేణులు) ఏర్ప రచి వారికి ధన సహాయం చేశారు. వ్యాపారస్తులకు సౌక ర్యాలు కలిగించారు. అంతకు పూర్వము శిక్షాస్మృతి, పన్ను లభారం-విషయంలో బ్రాహ్మణ క్షత్రియ కులాలకు గల ప్రత్యేకతలను తొలగించి, 'వ్యవహారసమతి' 'దండసమతి' ఏర్పర్చారు. ఆస్తినిబట్టి పన్ను, నేరానికతగినట్లు శిక్ష. అంతే గాని కులాన్నిబట్టి కాదు. ఈ విధంగా వ్యాపారవర్గానికి చేతి వృత్తులవారికి రక్షణ, ప్రోత్సాహం కలిగింది. శాతవాహన కాలంలో వ్యాపారస్తులు, చేతివృత్తులవారు నూటికి నూరు పాళ్ళు బౌద్ధమతాన్ని స్వీకరించిన విషయం గమనార్హం.

కనుకనే శాతవాహన యుగాన్ని ఆంధ్రుల చరిత్రలో స్వర్ణయుగం అంటున్నాము. రోము, గ్రీకుదేశాలతోను చైనా, ఇండొనేషియా దేశాలతోను వర్తక వ్యాపారాలు చేయగల స్థాయిలో ఉత్పత్తిశక్తులు అభివృద్ధి చెందాయంటే గ్రామ కమ్యూన్, నాడు ఎంత ప్రయోజనకర పాత్ర వహించిందో మనకు బోధపడగలదు. ఈ గ్రామ కమ్యూన్ పునాదిపై,

శాతవాహనులు ఒక ఉదార భూస్వామ్య రాజ్యాంగ యం త్రాన్ని (libaral feudal state) ఏర్పరచారు.

ఆంధ్రుల చరిత్ర ఇలా ప్రారంభమైంది. యూరపియన్ జాతులవలెనే ఆంధ్రులుకూడా, అర్థబానిస విధానం ప్రారంభంతో, ఒక జాతిగా రూపొందసాగారు.

ఐతే నాటి గ్రామీణ కమ్యూన్, శాతవాహనులు నిర్మించిన ఉదార రాజ్యాంగ యంత్రమూ అదేవిధంగా ఎల్లకాలమూ లేవు. అవి అనేక రూపాంతరాలు చెందుతూ వచ్చాయి. భూమిపై 'సమష్టి' యాజమాన్యం నామమాత్రమై, వ్యక్తిగత ఆస్తిహక్కులు ఏర్పడసాగినవి. ఉదార రాజ్యాంగ యంత్రం నశించి, నిరంకుశ రాచరిక వ్యవస్థ ఏర్పడ్డది. క్రీ. శ. 200–600 మధ్య ఏర్పడిన పల్లవ, విష్ణుకుండిన రాజ్యాలు, నిరంకుశ భూస్వామ్య రాజ్యాంగ యంత్రాన్ని (Tyrannical feudal state) స్థాపించాయి. అంతర్యుద్ధ ఫలితాలుగా ఈ రాజ్యాలు నశించి కాకతీయులకాలం నాటికి (Unified feudal state) ఐక్యభూస్వామ్య రాజ్యాంగయంత్రం ఏర్పడ్డది. మహమ్మదీయుల దాడుల ఫలితంగా అదీ నశించి, విజయనగర కాలం నాటికి సామ్రాజ్య యంత్రాంగం (Imperial feudal state) ఏర్పడ్డది. ఆస్థి హక్కులలోను, పన్నుల పద్ధతిలోను, వర్తక, వ్యాపారాలలోను వ్యవసాయ పద్ధతులలోను అనేక మార్పులు వచ్చాయి. ఈ మార్పులు గ్రామ కమ్యూన్ స్వరూపాన్నే పూర్తిగా మార్చివేశాయి. ఇవన్నీ ప్రత్యేకంగా పరిశీలించవలసిన సమస్యలు.

(1—10—54)





**మనసు ఫౌండేషన్**

**పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA108B137 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25-10-24 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 95 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | CF, TF, BCF |
| లేని పేజీలు | 59,60 |
| తయారు చేసినది | Sowmya |
| పేజీలు విడదీసినది | Sowmya |
| స్కాన్ చేసినది | Hemo |
| పరీక్ష చేసినది | KASIMBI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | No |
| పరిస్థితి | good |